Photo by S. G. Pradhan



బహుమతి పొందిన వ్యాఖ్య

దిగి ఈదులాడేవి రెండు!

పంపినవారు:
వి. బి. ఎ. నరసింహం, ఖర్గపూరు

## ఈ సంచికలో కథలు
## వింతలు - విశేషాలు







ఇవిగాక రంగుల బొమ్మ కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు, విశేషాలు, మొదలైనవి మరి ఎన్నో ఆకర్షణలు


దీపావళి విడుదల
శ్రీ రాజరాజేశ్వరీ
ఫిలిం కంపెనీ వారి
శ్రీకృష్ణ తులాభారం
యస్. వరలక్ష్మి
శ్రీరంజని (జూనియర్)
సూర్యకళ
సూర్యకాంతం
రఘురామయ్య
రేలంగి · సూరిబాబు














PHILIPS

# ప్రెసిడెంట్

హృదయపూర్వకమైన
మా దీపావళీ అభినందనములు



"ప్రెసిడెంట్" వెజిటబిల్ హెయి
రయిల్, స్నో, టాల్కమ్ పౌడర్లు
దీపావళీ శుభసమయాన మీకు
సంతోషమును సమకూర్చుగాక.




**RATHOD TRADING CO · SOWCARPET · MADRAS · 1**

## ఆరోగ్యప్రదాయిని




జీవామృతము వాడుటవలన బలహీనదేహములకు బలమును, దుర్బలులకు పటుత్వమును, నిద్రాహీనులకు సుఖ నిద్రయు, నరముల ప్రోగుకు కండపుష్టియు, మందకొడిగ నుండువారికి ఉల్లాసమును, జ్ఞాపకహీనులకు జ్ఞాపకశక్తియు, రక్తహీనులకు క్రొత్త రక్తమును, జీర్ణశక్తి లేనివారికి జఠరదీప్తియు, పాలిపోయినవారికి తేజస్సును, మొదలగు అసంఖ్యాకములైన సుగుణములు ఎన్నియో కలుగును. స్త్రీ-పురుషులెల్లరు వయోభేదము లేక ఎల్లకాలములయందు సేవింపదగిన దివ్యమైన టానిక్.

# జీవామృతం

కండపుష్టికి, జవసత్వములకు.

**ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్,**
మదరాసు – 17.




infa

అరవై సంవత్సరములపైనుంచి డాక్టర్లు పెర్టుసిన్ టెష్నర్‌ను సిఫార్సు చేయుచున్నారు. ఎందువలననగా అది దగ్గులకు, గొంతు నొప్పికి శ్వాసకోశ వ్యాధికి, ఉబ్బసమునకు, కోరింత దగ్గుకు ఉపశమనము నిచ్చును. క్షేమముగా స్వస్థతనిచ్చును. తీసుకొనుటకు యింపితమైనది. పెర్టుసిన్ కొనుడు!

అందరు కెమిస్టుల వద్దను లభించును

ఎటెఫా లి., షాన్ లీచ్‌టెన్‌స్టెయిన్, స్విస్ కస్టమ్ అండ్ ఎకనామిక్ టెర్రిటరీ వారితో చేసుకున్న ఒడంబడిక ప్రకారము, యిండియాలో ఇన్‌ఫా లి., పోస్టు ఆఫీసు బాక్సు నెం. 1041, బొంబాయి-1 వారిచే తయారయినది.

ILY-9-TEL

## చందాదారులకు మనవి

★

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ దీపావళి ప్రత్యేక సంచిక పాఠకులకు వినోద విజ్ఞానాలను చేకూర్చుతుందని ఆశిస్తున్నాము.

ప్రొఫెసర్ పి. సి. సర్కార్‌గారు "చందమామ" పాఠకులకు సుపరిచితులు. ఆయన "ఇంద్రజాలం" అనే శీర్షికక్రింద అనేక వ్యాసములు "చందమామ"లో లోగడ ప్రకటించారు. కారణాంతరాలవల్ల కొంతకాలంగా నిలిచిపోయిన ఈ వ్యాసాలను తిరిగి ఈ సంచికనుంచీ ప్రకటించటానికి గర్విస్తున్నాము.

మేము కోరినప్రకారం కొందరు పాఠకులు హాస్య చిత్రాలు పంపారు. వాటిలో కొన్ని ఈ సంచికలో ప్రచురించాము. ఇతర పాఠకులుకూడా ఇలాటి చిత్రాలను పంపగలరని మా ఆశ.

మా పాఠకులందరికీ దీపావళి శుభాకాంక్షలు.

నవంబరు
1955



సంపుటి 17
సంచిక 5

# బలవంతుడి కొలువు

సంహరించుకళ చక్కగ నేర్చిన
సింహమెకద మరి మృగరాజు.
ఆ మృగరాజుకు మోజు కలిగెను
సమస్త మృగముల నొక పరికనగా.

తన గుహలోనే దర్బారంటూ
పనిచె మృగాలకు ఫర్మానాలను,
రాజాజ్ఞను విని రయమున చేరెను
గజగజ లాడుచు జంతువులన్నీ.

ఈనా డా గుహ రాజదివాణమె,
ఐనా సింహము భుజించి విడిచిన





కళేబరాలూ, కుళ్ళిన మాంసం,
బొళ్ళున వాంతులు వచ్చే వాసన!

ఆరోగ్యములగు నరణ్యసీమల
తిరిగి సుఖపడే ప్రాణులాయె నవి!
ఆ గుహలోపల ప్రవేశించగనె
మృగముల ముక్కులు బ్రద్దలు కావా?

ఆ సభలోనికి అడుగిడుతూనే
మోసము తెలియని ఒక భల్లూకం,
'బాబో, ఏమీ గవులు కంప'నుచు
లబలబలాడుచు ముక్కు మూసుకొనె.

కంపన్నందుకు గర్జిలి సింహం
చంపివేసెనా యెలుగుబంటిని.





(గేయ కథ)

"తప్పదు, నిజమును చెప్పక నీవు,
చెప్పది, కంపా సువాసనా?" యని
హుంకరించు ఆ సింహం ముందర
జంకుచు నిలిచి జిత్తుల నక్క,
"జలుబుచేసి నా కేవాసనయు
తెలియుటలే"దని యుక్తిగ బొంకెను.
నక్కకు గండము తప్పిపోయెను
చక్కని నీతియు మనకు దొరికెను.
"బలవంతులకడ బ్రతికే ప్రజలకు
బొంకుటయే శ్రీరామరక్ష!" యని.

తన ప్రభుచర్యకు బళిబళి యంటూ
వానరమొక్కటి ముఖప్రీతిగా,
"చక్కని శాస్తియె జరిగెను దానికి,
లేకుంటే ఇది కంపంటుందా!
మల్లీ జాజీ గులాబి ఘుమఘుమ
బలాదూరు మీ వాసనము!" దనె.
అదికూడా ఒక అపచారమె యై
వధించె సింహం కోతినికూడా.
ఇక యేమన్నా అట ముప్పేయని
బిక్కమొగాలతొ మృగములు నిలువ,
బలాత్కారమే ప్రభుధర్మంగా
అలోకిస్తూ నక్కను చూసి,



# మామయ్య కాల్చిన మతాబా!













# ఉచ్చనీచలు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఒక సింహంగా జన్మించాడు. ఆ సింహం ఒక కొండ గుహలో తన భార్యతోకూడా నివసిస్తూండేది. ఒకనాడా సింహం ఆకలి గొనివున్నదై, కొండమీదినుంచి కిందికి చూసింది. కొండ కింద ఒక కొలనుపక్క గల పచ్చిక మైదానంలో దానికి కొన్ని కుందేళ్ళూ, జింకలూ ఆడుకుంటూ, గెంతుతూ కనిపించాయి. వెంటనే సింహం ఒక రంకెపెట్టి కొండ దిగి వాటివేపు ఉరికింది. కాని అలాపోతూ అది కొలను పక్కన ఉండే ఊబిలో పడిపోయింది. ఈలోగా సింహాన్నిచూసి కుందేళ్ళూ, జింకలూ పారిపోయాయి.

ఊబినుంచి బయటపడటానికి ప్రయత్నించినకొద్దీ సింహం మరింత లోపలికి దిగబడసాగింది. అందుచేత అది కదలకుండా వుండిపోయి, తనను రక్షించగల వారెవరైనా అటుగా వస్తారా అని ఎదురు చూడసాగింది. ఆకలితో అలమటించుతూ ఆ సింహం ఒకవారంరోజు లున్నమీదట, పక్కనేవున్న కొలనులో నీరు తాగటానికి నక్క ఒకటి వచ్చి, సింహాన్నిచూసి బెదిరి దూరంగా ఆగిపోయింది.

సింహం నక్కను చూసి, "నక్క తమ్ముడూ! వారంరోజులుగా ఈ ఊబిలో చిక్కి చచ్చిపోయే స్థితిలో ఉన్నాను. నన్నెలాగైనా కాపాడి పుణ్యంకట్టుకో!" అని ప్రాధేయపడింది.

"అసలే ఆకలితో ఉన్నావు, నన్ను చంపేస్తావేమో? నిన్నెలా నమ్మటం?" అన్నది నక్క భయపడుతూ.

"ప్రాణభిక్ష పెట్టిన ప్రాణిని చంపుతానా? నన్ను రక్షించావంటే, నీకు బతికి ఉన్నన్నాళ్లూ కృతజ్ఞతగా వుంటాను. నా మాట నమ్ము!" అన్నది సింహం.

నక్క, సింహం మాటలు నమ్మి, ఎండు కట్టెలను తెచ్చి ఊబిలో పడవేసింది. వాటిమీద కాళ్ళు ఊన్చి సింహం ఊబిలో నుంచి బయటికి రాగలిగింది. తరవాత రెండూ కలిసి వేటకు బయలుదేరాయి. సింహం ఒక జంతువును చంపింది. దాన్ని రెండూ సమంగా పంచుకుతిన్నాయి.

"ఇకనుంచీ మనం సోదరులం! నువ్వొక చోటా నేనొకచోటా ఉండటం దేనికి? నీ కుటుంబాన్ని మా గుహకే తీసుకురా! అందరం కలిసికట్టుగా జీవింతాం!" అన్నది సింహం. నక్క అంగీకరించి, భార్యతో సహా సింహం గుహలో కాపరంపెట్టింది.

సింహం వెంట తానుకూడా కాపరం చెయ్యటం గొప్పగా ఉంటుందని నక్క ఈ ఏర్పాటుకు ఒప్పుకున్నదేగాని, తన జాతి వారికి దూరమైపోవటంలో గల నష్టకష్టాలు తెలియక కాదు. సింహంకూడా నక్క చేసిన త్యాగాన్ని అర్థంచేసుకుని, ప్రతి స్వల్ప విషయంలోనూ తన మిత్రుణ్ణి తనతో సమంగా చూసుకుంటూ, నక్క మనసుకు ఏమాత్రమూ బాధ కలగకుండా ప్రవర్తిస్తూ రోజులు గడపసాగింది.

సింహం నక్కను ఎంత ప్రేమతో చూసినా సింహం భార్య నక్క భార్యను తక్కువగానే చూసేది. అయితే నక్క





భార్య తన జాతి తక్కువను ఆమోదించినది కావటంచేత రెండు కుటుంబాల మధ్యా ఎట్టి పేచీలూ రాలేదు. అయితే కాలక్రమాన సింహానికీ, నక్కకూకూడా పిల్లలు కలిగి, అవి సమంగా ఆడుకుంటూ ఉండటంచూసి సింహం భార్యకు మండిపోయింది. తాము తక్కువనీ, సింహం పిల్లలు ఎక్కువనీ తెలియని నక్కపిల్లలు, సింహంపిల్లలతో కిందా మీదాపడి ఆడుకుంటున్నాయి.

ఉచ్చనీచల విషయం తెలియని సింహం పిల్లలుకూడా నక్క పిల్లలతో సమంగా ఆడుతున్నాయి.

ఇది చూసి ఓర్చలేని సింహం భార్య తన పిల్లలతో చాటుగా, "మనం గొప్ప పుటక పుట్టినవాళ్ళం. మీరా నక్కపిల్లలతో అంత చనువుగా ఆడరాదు. వాటిని దూరంగా ఉంచండి!" అని చెప్పింది.

సింహం పిల్లలకు తల్లిబోధ కొంచెం కొంచెమే తలకెక్కసాగింది. అవి నక్క పిల్లలను లోకువగా చూడటమూ, వాటితో ఆడేటప్పుడు అన్యాయం చెయ్యటమూ, "మేము గొప్పవాళ్లం మిమ్మల్ని మేము పోషిస్తున్నాము. మాకు మీరు ఎదురు చెప్పకూడదు. మీరు తక్కువవాళ్లుకనక తిట్టినా పడిఉండాలి!" అనటమూ సాగించాయి.



అడవినక్కకు కష్టంవేసి ఒకనాడు తన భర్తతో సింహం భార్య వైఖరిగురించి చెప్పింది. సింహంతో మర్నాడు వేటకు వెళ్లే టప్పుడు నక్క, "మీది రాచజాతి. మేం సామాన్యులం. అందుచేత మనం కలిసి ఉండటం అంత మంచిదికాదు. మేము వెళ్లి మావాళ్ల మధ్యను బతుకుతాం!" అన్నది.

ఆకస్మికంగా తన మిత్రుడిలో కలిగిన ఈ మార్పుకు ఆశ్చర్యపడి సింహం కారణ మడిగింది. నక్క జరిగినదంతా చెప్పింది. గుహకు తిరిగిరాగానే సింహం తన భార్యతో, "నువు నక్కపిల్లల్ని చూసి అసహ్యపడ్డా వుటకదా?" అని అడిగింది.

"అవును. ఆ తక్కువజాతి పిల్లలు మన పిల్లలతో సరిసమానంగా ఆడుకోవటం నాకేమీ బాగాలేదు. మీకా నక్క ఏమి మందుపెట్టి మంచిచేసుకుందో నాకు తెలీదు. నా పిల్లలు పాడుకావటం మాత్రం నేను ఒప్పను!" అన్నది సింహం భార్య.

"అదా సంగతి? నక్క నాకేం మందు పెట్టిందో చెబుతాను విను. నేను ఒకసారి వారంరోజులు ఇంటికి రాలేదు జ్ఞాపకం ఉన్నదా? ఆ వారంరోజులూ నేను తిండి లేక మాడుతూ ఊబిలో చిక్కాను. నా ప్రాణాలుపోతున్న సమయంలో ఈ నక్క వచ్చి యుక్తిగా నన్ను ఊబినుంచి బయ టికిలాగింది. ఆనాడు నక్కే నన్ను ఆదు కోకపోతే నేనూ వుండను, మన పిల్లలూ ఉండరు! ప్రాణభిక్ష పెట్టినవాళ్ళ దగ్గిర ఉచ్చనీచలు పాటించటం మహాపచారం. అటువంటి వాళ్ళను అవమానించటం బంధువులను అవమానించటం లాటిదే!" అన్నది సింహం.

సింహం భార్య సిగ్గుపడి నక్క భార్యకు క్షమాపణ చెప్పుకున్నది.

తరువాత ఏడు తరాలదాకా సింహం సంతతీ, నక్క సంతతీ అదే గుహలో ఎంతో సఖ్యంగా కలిసి జీవించాయి.






# 5

[ మందరదేవుడికి, శివదత్తుడితో పరిచయం అయిందికదా? అప్పుడు శివదత్తుడు, కుండలినీద్వీప రాజు వినోదాలతో కాలక్షేపంచేయటం, దేశం అరాజకంపాలు కావటం, చివరకు రాజధానీనగరాన్నే శత్రువులు ముట్టడించటం; ఆ పరిస్థితుల్లో సేనానాయకత్వం నరవాహనుడికి లభించే ప్రమాదం కలగటం—అంతా చెప్పుకుపోతున్నాడు. తరవాత—]

శివదత్తుడు చెప్తున్నదంతా, శ్రద్ధగా ఆలకిస్తున్న మందరదేవుడికి, క్షణక్షణానికీ ఆశ్చర్యం అధికం కాసాగింది. మహాసముద్రంమీద, ఆ కారుచీకటిలో పడవలు ఎటుకేసి పోతున్నదీ అతను గమనించటం లేదు. చివరకు అతడు శివదత్తుడి మాటలకు అడ్డువచ్చి, "శివదత్తా, సేనానాయకత్వం దుష్ట నరవాహనమిశ్రుడిపాల బడకుండా, మీరు అడ్డుకోలేకపోయారా? మీరే స్వయంగా సేనానాయకత్వం స్వీకరిస్తే సరిపోయేదిగదా?" అన్నాడు.

ఆ మాటలకు శివదత్తుడు నవ్వి, "మందరదేవా! ఆనాటి పరిస్థితుల్లో అది అంత తేలికయిన మాటగాదు. నాకై నేను సేనానాయకత్వాన్ని యివ్వమని అడగటం ఏం బావుంటుంది? అట్లని నాయకత్వం దుష్టుడిచేత బడనేయటమూ శ్రేయస్కరం కాదు! అందుకని నేను మార్గాంతరం ఏమిటా అని ఆలోచించ సాగను. నా వాలకం గమనించిన సమరసేనుడు:

"శివదత్తా, ఏమిటాలోచిస్తున్నావు? చెప్పదలచినదేమైనా వుంటే, నిస్సంకో

చంగా చెప్పు," అన్నాడు. అప్పుడు నేను ఆయనతో యిలా చెప్పాను :

"సమరసేనా! ఇప్పటి పరిస్థితుల్లో మీరే సేనా నాయకత్వం వహించటం మంచిదని నేను భావిస్తున్నాను. శత్రుబలం, వాళ్ళు పంపిన సందేశాన్నిబట్టి చూస్తే—అంత తేలికగా కొట్టివేయవలిసిందికాదు. దుర దృష్టవశాత్తూ మన సైన్యం ఒక్కసారి వాళ్ళచేతుల్లో ఎంత చిన్నదెబ్బతిన్నా, అది మరికొందరు శత్రువులు మనమీద ధ్వజం ఎత్తటానికి ఉత్సాహం కలిగిస్తుంది. కనుక మీరే సైన్య నాయకత్వం స్వీకరించండి." సమరసేడు ఒక్క క్షణకాలం ఆలోచించి, తలవూపి "సరే, అలాగే చేస్తాను!" అన్నాడు

అంతలో అక్కడికి నరవాహనమిశ్రుడు వచ్చాడు. అతణ్ణి చూస్తూనే సమరసేనుడు, "నరవాహనా! నీకోసం కబురు పంపుదా మనుకుంటున్నాను. సరే, నువ్వు వెంటనే వెళ్ళి సైన్యసమీకరణ చెయ్యాలి. ఒకగంట వ్యవధిలో కనీసం రెండువేలమంది సైనికుల నైనా సమాయత్తపరచాలి. సూర్యాస్త మయంలోపల శత్రుశేషం లేకుండా చేయ వలసివుంది," అన్నాడు.

నరవాహనమిశ్రుడు అక్కడినుంచి వెళుతూ, నాకేసి చిన్నగా నవ్వాడు. అది విషపు నవ్వు. కాని అందులో ఎంత కాల



కూట విషం వున్నదో ఆ క్షణాన నేను గ్రహించలేకపోయాను.

సమరసేనుడు నాకేసి తిరిగి, "శివదత్తా! నువ్వుకూడా నీ అనుచరులను సమాయత్తం చేయి. ఎందుకయినా మంచిది— కనీసం పాతబడిన కత్తుల తుప్పయినా వదిలించవచ్చు" అన్నాడు నవ్వుతూ.

నేను నా అనుచరుల్లో మెరికలవంటి వారిని, ఒక పాతిక మందిని సర్వసన్నద్ధం చేశాను. మహాసేనాని అయిన సమరసేనుడి నాయకత్వంకింద శత్రువులతో పోరాడి చాలా కాలం అయింది. తిరిగి అలాంటి అవకాశం వస్తున్నదని చాలా సంతోషించాను.

ఒక గంటకాలం గడచిపోయింది. నరవాహనమిత్రుడు, సైన్యసమీకరణ చేసి, ఆ వార్తచెప్పేందుకు వస్తాడని, నేనూ, సమరసేనుడూ ఎదురుచూస్తూ కూర్చున్నాం. గంటతరవాత నరవాహనుడు రానేవచ్చాడు. అతడి వాలకం చూసి, మేం యిద్దరం చాలా ఆశ్చర్యపడ్డాం.

అతడి ఒరలో కత్తి లేదు! ధరించిన దుస్తులు చిరిగిపోయి వున్నవి, జుట్టంతా రేగివున్నది, మొహంమీద అక్కడక్కడా చిన్న గాయాలుకూడా కనిపించనై మనిషి చాలా భీతిగొన్నట్టు కనిపించాడు. "ఏం, నరవాహనా! ఏం జరిగింది ? అలా వున్నా





వేమిటి?" అంటూ సమరసేనుడు ఎంతో ఆదుర్దాగా ఆతణ్ణి ప్రశ్నించాడు.

నరవాహనుడు మాట్లాడేందుకు ప్రయత్నించాడు. కాని గొంతు జీరపోయినట్టు కనబడింది. "పరిస్థితులు మన చేజారి పోయినై. మనం సురక్షిత ప్రదేశానికెక్కడికైనా పారిపోవటం మంచిది," అన్నాడు నరవాహనుడు బొంగురుగొంతుతో.

ఆ మాటలు వింటూనే సమరసేనుడు తోక తొక్కిన తాచుపాములా లేచి నిలబడ్డాడు. ఆయనలో అంత కోపోద్రేకం, తొందరపాటూ—ఆ నాటివరకూ నేను చూచివుండలేదు.



"నా రాజ్యంలో నేను సురక్షిత ప్రదేశానికి పారిపోవటమా? ఈ కుండలినీ ద్వీపంలోని ప్రతి అంగుళంభూమీ, నాకు రక్షణ యివ్వ గలిగినదే! నీకేమీ పిచ్చిపట్టలేదు గదా?' అన్నాడు సమరసేనుడు.

నరవాహనమిత్రుడు వణికిపోయాడు. తిరిగి సమరసేనుడు ఏమో మాట్లాడబోయేంతలో కోట ముఖద్వారంవేపునుంచి భయంకరారావాలు వినిపించినై. పెనుతుపానుకు మహావృక్షాలు వొణికినట్టు, మేం వణికిపోయాం.

"ఏమిటా అరుపులు?" అంటూ సమరసేనుడు, నరవాహనుడికేసి చూస్తూ కఠినంగా ప్రశ్నించాడు.

"సమరసేనా! అదే నే చెప్పదలుచుకున్న భయంకరవార్త! సైనికులు, ప్రజలతో కలిసిపోయారు. 'రాజును గద్దెనుంచి దింపాలి,' అని అరుస్తూ వాళ్ళు వీధులలో ఊరేగుతున్నారు. నేను సైనికులను సమీకరించేందుకు ప్రయత్నించాను. అందుకు వాళ్ళు నాకు చేసిన బహూకరణ యిది! ప్రాణాలతో పారిపోయి మీ దగ్గరకు రాగలగటం, కుండలినీదేవి కరుణ!" అన్నాడు నరవాహనుడు. ఆ మాటలు వింటూనే సమరసేనుడు, నెత్తిన పిడుగుపడిన








వాడిలా కూలబడ్డాడు. ఎవరికోసం అయితే తను అన్నిటికీ తెగించి, మంత్రాలంకివిలో పతరాని యిడుములుపడ్డాడో— ఆ ప్రజలు, ఆపత్సమయంలో తన నాయకత్వాన్ని తృణీకరించటం, సమరసేనుణ్ణి సిలువునా కూల్చింది. పాపం, అతడికి అమధ్య కాలంలో వచ్చిన పరిణామాలూ, దుష్ట నరవాహనుడి కుటిలపాత్రా తెలియదు!

"సమరసేనా, అధైర్యపడకండి. ఏదో విధంగా, యీ ప్రమాదాన్నుంచి బయట పడేమార్గం ఆలోచించండి," అన్నాను.

సమరసేనుడు పెద్దగా నిట్టూర్చి, "శివదత్తా, నేను అధైర్యపడుతున్నానని అనుకోకు. ప్రజలు నాపట్ల ఎంత కృతఘ్నులుగా ప్రవర్తిస్తున్నారో ఆలోచించినప్పుడు, నా హృదయం భగ్గున మండుతోంది. అంతకన్న మరేంలేదు," అన్నాడు.

ఆయన్ని ఎలాంటి మాటలతో అనునయించాలో నాకు తెలియలేదు. నరవాహనుడికేసి చూశాను. అతడు స్థాణువులా కదలా మెదలక వుండిపోయాడు. ఆ క్షణంలోనే కోటద్వారంవేపునుంచి భీకరమైన జనఘోష వినబడింది. అంతలో ఒక ద్వారపాలకుడు పరుగెత్తుకుంటూ మా దగ్గరకు వచ్చాడు. ఏమిటీ సంగతి అని నే నడిగేంతలో—"మహాసేనానీ, ప్రమాదం ముంచుకొస్తోంది. ప్రజలు కోటద్వారం బద్దలుకొడుతున్నారు!" అన్నాడు.

సమరసేనుడు ఒక క్షణకాలం తల వంచుకుని వుండిపోయాడు. అతడు ఆ ద్వారపాలకుడి మాటలు విన్నాడో లేదో అన్న అనుమానంకూడా నాకు కలిగింది. నేను మాట్లాడబోయేంతలో ఆయనే తల ఎత్తి నాకేసి చూశాడు. ఆ చూపుల్లో వున్న భావం నా కర్థమైనట్టయింది.

"మృగశాలాధిపతిని వెంటనే యిక్కడకు పిలుచుకురా!" అని ద్వారపాలకుణ్ణి ఆజ్ఞాపించాను. కొద్దిసేపటిలో మృగశాలాధి



"...కాని సేనానీ, ఒకసారి ఆ క్రూర జంతువులను వదిలితే, బయట వున్న ప్రజలమీద..." అని మృగశాలాధిపతి ఏమో చెప్పబోయాడు. అప్పుడు నేను కోపంగా, "అవన్నీ నీ కనవసరం. కోట ద్వారాన్ని బద్దలుకొడితే, ఏం జరుగుతుందో ముందుగా వాళ్ళు గ్రహించటం చాలా మంచిది! నువ్వు వెంటనే వెళ్ళి నే చెప్పిన పని చెయ్యి!" అన్నాను.

మృగశాలాధిపతి వెంటనే వెళ్ళిపోయాడు. నరవాహనుడికేసి చూశాను. అతడు పళ్ళు బిగించి, నాకేసి క్రోధంగా దొంగచూపులు చూస్తున్నట్టు గ్రహించాను. అతడి ఎత్తుగడ ఏమిటి? ఈ సైనికులా, ప్రజలా తిరుగుబాటులో అతడి దుష్టపాత్ర ఎంత వరకూ వుంది? ఇలాంటి ప్రశ్నలకు అప్పట్లో నాకు జవాబులు దొరకలేదు.

ఒక అరఘడియ గడిచేసరికి. మా కర్ణపుటాలు బద్దలయ్యేలా సింహగర్జనలూ, ఏనుగుల ఘీంకారాలూ వినిపించినై. కోట ప్రాంగణమంతా క్రూరమృగాల అరుపులతో, అర్భాటాలతో ప్రతిధ్వనించింది.

సమరసేనుడు తక్కున లేచి గబగబా భవనం ముందుభాగాన గల ఎత్తయిన మంటపంమీదికి వెళ్ళాడు. అక్కడ నిల

పతి వచ్చాడు. అతడు రాగానే, "నీ స్వాధీనంలో వున్న మృగాలనన్నిటినీ, బోనుల్లోనుంచి వదిలిపెట్టు. పోతే, అవి ప్రాసాదప్రాంగణంలో, ముఖద్వారం దగ్గరా మాత్రమే వుండేట్టు చూడు. అవసరం అయినప్పుడు తిరిగీ వాటిని బోనుల్లో పెట్టేందుకు, నీకింద నౌకర్లనందర్నీ సిద్ధంగా వుంచు," అని ఆజ్ఞయిచ్చాను.

మృగశాలాధిపతి తెల్లబోతూ సమరసేనుడికేసి ప్రశ్నార్థకంగా చూశాడు. సమరసేనుడు విసుగ్గా తలపంకించి, "శివదత్తుడి ఆజ్ఞలన్నిటినీ. నా ఆజ్ఞలగానే భావించి శిరసావహించు!" అన్నాడు.

బడి చూస్తే, భవనంముందు గల ఖాళీ ప్రదేశం, ముఖద్వారానికి గల ఇనప కమ్ములూ, ఆ వెనక వీధిలో గోలగా అరుస్తున్న ప్రజలూ—అంతా కనబడుతుంది.

సమరసేనుడి వెనకనే, నేనూ వెళ్ళి మంటపంమీద నిలబడ్డాను. బోనుల్లోనుంచి విడవబడిన క్రూరమృగాలు ప్రాంగణం అంతా పిచ్చలవిడిగా విహరిస్తున్నై. కొన్ని ముఖద్వారానికి గల ఇనపకమ్ములలోంచి చూస్తూ, అవతల వున్న ప్రజలమీదికి పంజాలు చాచి గర్జించ సాగినై.

"శివదత్తా, చాలా చక్కని యోచన చేశావ్!" అంటూ సమరసేనుడు నాకేసి తిరిగి చిరునవ్వు నవ్వాడు. "ఈ క్రూర మృగాల భయమే వాళ్ళను కోటద్వారం బద్దలుకొట్టకుండా ఆపింది. అయినా యిది తాత్కాలికంగా మనకు ఊపిరి పీల్చుకునేందుకు లభించిన అవకాశంమాత్రమే అనుకుంటాను. ఇంత అరాజకానికీ కారకులైన ఆ నాయకులెవరు? అంతా అయోమయంగా వుంది," అంటూ వెనక్కు తిరిగి చూశాడు సమరసేనుడు.

నరవాహనుడు, మాకు కొంత వెనకగా చేతులు కట్టుకు నిలబడివున్నాడు. అతడు మాదగ్గరకు వచ్చి, "సమరసేనా, వాళ్ళు రాజను పదవిచ్యుతుణ్ణి చెయ్యాలని పట్టుబడుతున్నారు. నాయకులెవరో నాకూ తెలియదు," అన్నాడు.

సమరసేనుడు కొంచెంసేపు వూరుకొని, తరవాత యిలా అన్నాడు. "దేశం యింత అరాజకస్థితిలో వున్నదని నేనెన్నడూ ఊహించనైనా లేదు. పట్టణప్రాకారాల అవతల శత్రువులూ, లోపల రెచ్చిపోయిన ప్రజలూ! వీళ్ళకు రాజు గద్దెదిగితే చాలు; వాళ్ళకు రాజ్యాధికారమే కావాలి! పరిస్థితి యిదనుకుంటాను. అంతేగదా, శివదత్తా?" అని నన్ను ప్రశ్నించాడు.—(ఇంకా వుంది)



# ఏడుపూ - నవ్వూ



పట్టుదలతో విక్రమార్కుడు ఇరుగుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి. శవాన్ని చెట్టుమీది నుంచి భుజాన వేసుకుని వస్తూండగా, శవంలో ఉన్న బేతాళుడు, "రాజా, ఇంకొకరిచేత పనులు చేయించుకోవలిసిన నువే ఈ అర్థరాత్రివేళ ఇంత శ్రమపడటం నాకెంతో విచారంగా వున్నది. నీకు మార్గాయాసం కలగకుండా ఒక చిత్రమైన కథ చెబుతాను విను," అంటూ ఈ కింది కథ ఆరంభించాడు :

భగవంతుడు శ్రీరామచంద్రుడుగా అవతారమెత్తి పరిపాలించిన అయోధ్యా నగరాన్ని ఒకప్పుడు వీరకేతుమహారాజు పాలించాడు. ఆ సమయంలో అయోధ్యలో ప్రతి నిత్యమూ అతివిచిత్రమైన దొంగతనాలు జరగసాగాయి. ఈ దొంగతనాలకు తట్టుకోలేక ప్రజలు రాజుగారి దగ్గిరికి వెళ్ళి,

## బేతాళ కథలు




"మహాప్రభూ, మమ్మల్ని దొంగల బారి నుండి ఎట్లాగైనా కాపాడండి. మేము ఎన్ని ప్రయత్నాలు చేసినా దొంగల ఆచోకీ తెలియటంలేదు. ఈ దొంగలు చిక్కకపోవటం అటుంచి, కనీసం కంటికైనా కనపడకుండా అతి సాహసమైన దొంగతనాలు చేస్తున్నారు!" అని మొరపెట్టుకున్నారు.

వీరకేతుమహారాజు ప్రజలను ఓదార్చి పంపేసి, తన రక్షకభటులలో అత్యంత సమర్థులైనవారికి మారువేషాలు వేయించి, రాత్రిపూట రహస్యగస్తీ తిరగమని పంపాడు. వారంతా వెయ్యికళ్లతో కనిపెట్టవున్నా కూడా దొంగతనాలు యథాప్రకారం జరుగుతూనే వున్నాయి. ఒక్క దొంగ అయినా గస్తీతిరిగే భటుల కళ్ళ పడలేదు.

దొంగతనాలు సాగిస్తున్నవారెవరో చాలా యుక్తిపరులని నిర్ధారణ చేసుకున్నవాడై, వీరకేతు స్వయంగా దొంగలను పట్టటానికి బయలుదేరాడు. రాత్రి చీకటిలో రాజు మారువేషం వేసుకుని పోతూండగా ఆయనకు ఒక చోట విచిత్రంగా ప్రవర్తించే ఒక వ్యక్తి కనిపించాడు.

రాజు అతడికేసి బయలుదేరాడు. దగ్గరకు వస్తున్న రాజును చూసి ఆ వ్యక్తి, "ఎవరు నువు?" అని అడిగాడు.

"దొంగను!" అన్నాడు రాజు.

"అయితే నాకు సాటివాడివే! మా ఇంటికి పోదాంరా! నీకు స్నేహ మర్యాద చేస్తాను," అన్నాడు ఆ వ్యక్తి.

రాజు అతనివెంట వాళ్ల ఇంటికి వెళ్లాడు. ఆ ఇల్లు అడవిలో భూగర్భంలో రహస్యంగా నిర్మించిఉన్నది. దొంగ, రాజును ఒక గదిలో కూచోబెట్టి, వెంటనే వస్తానని చెప్పి, పక్క గదిలోకి వెళ్ళాడు. ఆసమయంలో దాసీ ఒకతె వచ్చి, రాజుతో, "నువ్వెవరు, బాబూ! ఈ గజదొంగ రహస్యం తెలిసినాక నీకు ఆయువుమూడినట్టే! వెంటనే పారిపో!" అని హెచ్చరిక చేసింది.

రాజు వెంటనే అక్కడినుండి బయలు దేరి అతి శీఘ్రంగా తన నగరుకు తిరిగి పోయి సాయుధభటులతో అదే చోటికి తిరిగి వచ్చాడు. గజదొంగకూ రాజభటులకూ ఘోరమైన యుద్ధం జరిగింది. ఒంటరిగాడై ఉండికూడా రాజభటులందరితోనూ ఎంతో సేపు ధైర్యంగా పోరాడి, అనేకమంది రాజ భటులను చంపి చిట్టచివరకు దొంగ రాజు చేతిలో ఓడిపోయాడు.

వీరకేతుమహారాజు దొంగను పెడ రెక్కలు విరిచికట్టి పట్టుకుపోయాడు. అతని విచారణ జరిగింది. చాలాకాలంగా ఎవరికంటా పడకుండా ఆ దొంగే అయోధ్య అంతటా దొంగతనాలు చేసినట్టు రుజు వయింది. పోయిన సొత్తంతా దొరికింది కూడా. రాజు దొంగను కొరతవేయించమని భటులకు ఉత్తరువిచ్చాడు.

దొంగను రాజభటులు కొరతవేయించ టానికి ఊరిబయటికి తీసుకుపోతూండగా, అయోధ్యానగరంలోని పెద్ద వైశ్యులలో ఒక డైన రత్నదత్తు డనేవాడి కూతురు రత్నవతి అనే యువతి దొంగను చూసి, తన తండ్రిని పిలిచి, "నాన్నా, నన్నా దొంగకిచ్చి పెళ్ళి చెయ్యండి!" అని అడిగింది. రత్నదత్తు డీ మాట విని నిర్ఘాంతపోయాడు.



ఎందుకంటే రత్నవతి లేకలేక కలిగిన బిడ్డ. ఆమెను రత్నదత్తుడు ఎంతో గారా బంగా పెంచుతూవచ్చాడు. రత్నవతి అపు రూపమైన అందగత్తెగా ఉంటటం చూసి ఎంతోమంది కోటీశ్వరులైన వైశ్యకుమా రులూ, రాజకుమారులూ ఆమెను పెళ్ళాడ తామని వచ్చారు. రత్నవతి అందరినీ నిరా కరించడమేగాక తనకు పెళ్ళే అవసరం లేదనికూడా అన్నది.

"ఏం, తల్లీ? నువు రాజాధిరాజులను కూడా పెళ్ళాడ నిరాకరించింది ఈ దిక్కు మాలిన దొంగకోసమా? వాణ్ణి కొరతవేయ టానికి తీసుకుపోతున్నారు. అటువంటి

వాడినా పెళ్ళాడేది ?" అని రత్నదత్తుడు కుమార్తె నడిగాడు.

రత్నవతి తండ్రిమాటలు వినిపించుకో లేదు. అనేకమంది రాజకుమారు లామెను వరించి వచ్చినప్పుడు తండ్రి ఆమెకు పెళ్లి చేసుకోమని సలహా ఇచ్చాడు. కాని అప్పుడు కూడా ఆమె తండ్రిమాటను ఏమాత్రం వినిపించుకుని ఉండలేదు.

"దొంగ అయేది, కొరతపడేది, అతన్నే నా భర్తగా వరించాను. నాకు పెళ్ళి కావా లని వుంటే అతన్నితెచ్చి నాకు పెళ్ళి చెయ్యండి. మీకది చాతకాని పక్షంలో నేనుకూడా అతనితోనే చచ్చిపోతాను. అంతేగాని నా మనసు మాత్రం మార్చుకునేది లేదు" అన్నది రత్నవతి.

ఈ మాటలు విని రత్నదత్తుడు చాలా కంగారుపడ్డాడు. తన కుమార్తె నిశ్చయం మారదని ఆయనకు తెలిసిపోయింది. ఆయన వెంటనే వీరకేతుమహారాజు దగ్గిరికి వెళ్ళి, "మహాప్రభూ, మీరీనాడు పట్టిన గజ దొంగను నాకు ఇచ్చెయ్యండి. నేను తమకు నాదగ్గిర ఉన్న నూరుకోట్ల సువర్ణాలూ ఇచ్చుకొంటాను," అన్నాడు. కాని రాజు ఒప్పుకోలేదు. అయోధ్యానగరాన్ని ఎంతో కాలం ఒంటరిగా పీడించిన గజదొంగను విడిచిపుచ్చటానికి ఆయన మనసు ఎంత



మాత్రం ఇష్టపడలేదు. హతాశుడై రత్న దత్తుడు ఇంటికి తిరిగివచ్చేసరికి, రత్నవతి స్నానంచేసి పెళ్ళికూతురై సిద్ధంగావుంది.

"అమ్మా, నా ప్రయత్నం ఫలించలేదు. దొంగను విడిచిపుచ్చటానికి రాజు ఒప్పుకో లేదు. నా కున్నదంతా యిస్తానన్నాను. లాభం లేకపోయింది. నువు కోరిన పెళ్ళి అసంభవం!" అన్నాడు రత్నదత్తుడు విచారంగా కూతురితో.

"పెళ్ళి కాకపోతే సహగమనం ఉండనే ఉన్నది," అన్నది రత్నవతి.

రత్నవతి పల్లకీ ఎక్కి వధ్యభూమికి బయలుదేరింది. ఆమెవెంట ఏడుస్తూ తల్లి దండ్రులుకూడా బయలుదేరారు. వారు వధ్యభూమికి వెళ్ళేసరికి అప్పటికే గజ దొంగను తలార్లు కొరతవేశారు. అతను చావు బతుకుల మధ్య ఉన్నాడు.

రత్నదత్తుడు తన కుమార్తెను దొంగ వద్దకు తీసుకుపోయి, "ఇదుగో, నాయనా, నా కుమార్తె నిన్నే పెళ్ళాడతానని పట్టుబట్టి వచ్చింది!" అని చెప్పాడు. ఈ మాట విని దొంగ ఒక్కసారి రత్నవతికేసి చూసి కన్నీరు కార్చి, వెంటనే చిరునవ్వు నవ్వి, మరుక్షణం ప్రాణంవిడిచాడు.

రత్నవతి తాను నిర్ణయించుకున్న భర్త కళేబరాన్ని తీసుకుని శ్మశానానికి పోయి,



అక్కడ చితి పేర్పించి, దానిమీద దొంగ శవంతోబాటు తానుకూడా ఎక్కింది.

మనసులో భర్తగా స్వీకరించినమాత్రాన సహగమనం చెయ్యటానికి సిద్ధపడిన రత్నవతి పతిభక్తికి సంతోషించి కాలభైరవుడు ప్రత్యక్షమై, "అమ్మా, నీ పతిభక్తి అసాధారణంగా ఉన్నది. నీకేవరం కావాలో కోరుకో, ఇస్తాను," అన్నాడు.

"దేవా, నా తలిదండ్రులకు నేనొక్కతనే కుమార్తెను. నేను పోతే వాళ్లు కడుపుకోతతో అల్లాడిపోతారు. వారికి పుత్రులు కలిగేట్టు అనుగ్రహించు. వారిని చూసుకుంటూ నన్ను మరిచిపోతారు," అన్నది రత్నవతి వినయంగా.

కాలభైరవుడు నవ్వి, "నీ కోరికప్రకారమే చేస్తాను; కాని నువు నీకై ఏమీ కోరవా ?" అని అడిగాడు.

"నాకు నా భర్తవెంట వుండటంతప్ప ఇంకే కోరికా లేదు!" అన్నది రత్నవతి.

"ఆ కోరికకూడా తీరుస్తాను!" అంటూ కాలభైరవుడు దొంగను బతికించి అంతర్థానమైనాడు. రత్నదత్తుడు, దొంగను ఇంటికి తీసుకువచ్చి వైభవంగా తన కుమార్తెకు వివాహం చేశాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, కొరత పడి చచ్చిపోతూ, రత్నవతి తనను పెళ్లాడగోరిందని విని దొంగ ఎందుకు ఏడ్చాడు? తరవాత ఎందుకు నవ్వాడు ? తెలిసి సమాధానం చెప్పకపోయావా, తల పగిలిపోతుంది," అన్నాడు.

"ఈ అకారణ బంధువుల ఋణం తీర్చుకోకుండానే పోతున్నానే అని దొంగ మొదట దుఃఖించాడు. ఎంతమంది రాజాధిరాజులనో నిరాకరించిన కన్య తనను వరించటంచూసి నవ్వాడు," అని జవాబు చెప్పాడు విక్రమార్కుడు.

రాజుకు మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోకూడా మాయమై చెట్టెక్కాడు.



# గొడ్డలి జావ

ఒక సిపాయి సెలవుమీద ఇంటికిపోతూ, కాళ్లునొచ్చి, కడుపుమాడి ఒక గ్రామం చేరి, ఒక ఇంటి తలుపు తట్టాడు. ఒక ముసలమ్మ తలుపు తీసింది.

"అవ్వా, ఆకలి దహించుకుపోతున్నది. ఇంత గంజిఉంటే పోస్తావా ?" అని అడిగాడు సిపాయి.

ముసలిది పిసినిగొట్టు. "నాకే నిన్నటినుంచీ తిండిలేదు, నాయనా?" అని అబద్ధమాడింది. ఈలోపుగా సిపాయికన్ను గదిలో ఒక మూలవున్న కర్రలేని గొడ్డలిమీద పడింది.

"గొడ్డలితల ఉన్నా కమ్మని జావ కాయవచ్చునే!" అన్నాడు వాడు.

"గొడ్డలిజావా, బాబూ? నేనెన్నడూ వినలేదే?" అన్నది ముసలిది.

"అవును. ఒక కుండఇయ్యి, చూపిస్తాను," అన్నాడు సిపాయి. వాడు గొడ్డలి కడిగి కుండలో పెట్టి, అందులో ఇన్ని నీళ్ళుపోసి, పొయిమీద పెట్టాడు. నీరు ఉడుకుపట్టినాక వాడు దాన్ని కలియబెట్టి, కొంచెంతీసి రుచి చూసి, "కాస్త ఉప్పుంటే బాగుండునే!" అన్నాడు.

"నే నిస్తానుండు, బాబూ," అని ముసలిది ఉప్పు తెచ్చి ఇచ్చింది.

సిపాయి ఇంత ఉప్పుతీసి కుండలోవేసి మళ్ళా రుచిచూసి, "భేష్! దీని కింకేమీ అక్కర్లేదు—గుప్పెడు నూకలుంటే చాలు!" అన్నాడు.

"నే తెస్తానుండు," అంటూ ముసలిది నూకలు తెచ్చింది. సిపాయి నూకలను కుండలోపోసి గరిటెతో కలియబెడుతూ జావ తయారుచేసి, మళ్లీ ఒకమారు రుచిచూసి, "ఇందులో ఇంత వెన్నకూడా పడితే స్వర్గానికి బెత్తెడు ఎడంగా ఉంటుంది!" అన్నాడు.

ముసలిది ఇంత వెన్నముద్ద తెచ్చి ఇచ్చింది. సిపాయి దాన్ని మరుగుతున్న జావలోవేసి, కాసేపు కలియబెట్టి పొయిమీదినుంచి కుండదించి, "ఇప్పుడు రుచిచూడవ్వా!" అన్నాడు.

అవ్వ రుచిచూసి, "ఎంతబాగుందీ! గొడ్డలిజావ ఇంత రుచిగా ఉంటుందని నాకు తెలీనే తెలియదూ!" అన్నది.

ముసలిదాని అమాయకత్వానికి తనలో తాను నవ్వుకుంటూ సిపాయి, కుండలోని జావలో సగం అవ్వకిచ్చి; మిగిలినదాంతో తన ఆకలి తీర్చుకుని తనదారిన తాను వెళ్లిపోయాడు.



# ప్రాయశ్చిత్తం

కైరో నగరంలో పూర్వం ఒక నగలవర్తకు డుండేవాడు. అతను ఇరవైలోపు వయసు గలవాడు. అతని దుకాణానికి తరుచు స్త్రీలే వస్తూండేవారు. వారి వలలలో పడిపోతా నేమోనని అతను వారికేసి చూడనైనా చూసేవాడు కాడు. అతని ప్రవర్తన చూసి అందరూ మెచ్చుకునేవారు.

ఇలావుండగా ఒకనాడతని దుకాణానికి ఒక నీగ్రో బానిసపిల్ల వచ్చి, "ఫలానివారి దుకాణం ఇదేనా? దుకాణదారు మీరేనా?" అని అడిగింది. అవునన్న మీదట ఆ పిల్ల అటూ, ఇటూ చూసి అతని చేతిలో ఒక చీటీ పెట్టింది. ఆ చీటీ విప్పిచూసి దుకాణదారుకు ఆశ్చర్యమూ, కోపమూ కలిగాయి. ఎందుకంటే అందులో ఒక ప్రేమ గీతం రాసి వున్నది. ఆఖరు చరణంలో అది రాసిన యువతి పేరుకూడా వున్నది.

నగలవర్తకుడు పర్రున చీటీ చించేశాడు. సమాధానంకోసం కనిపెట్టుకుని ఉన్న బానిస పిల్లని నానాతిట్లూ తిట్టి, దుకాణంలోనుంచి బయటికి గెంటేశాడు. ఇదంతాచూసి చుట్టుపక్కల వాళ్ళంతా, "ఆహా, ఎంత నీతిపరుడు!" అని ఆ వర్తకుణ్ణి శ్లాఘించారు.

రెండు మూడు సంవత్సరాలు గడిచాయి. మంచి కన్య దొరికితే పెళ్ళాడాలన్న అభిలాష నగలవర్తకుడికి కలిగింది. తన దుకాణానికి వచ్చే పోయే యువతులలో అందగత్తె, బుద్ధిమంతురాలూ, కన్యా అయిన పిల్ల ఎవరన్నా దొరుకుతుందా అని అతడు చూడసాగాడు.

ఒకనాడతని దుకాణానికి అయిదారుగురు తెల్ల బానిస స్త్రీలను వెంటబెట్టుకుని ఒక అందమైన యువతి వచ్చి, "మంచి

ఎస్. కోదండరామయ్య





నగలేమైనా ఉన్నాయా?" అని అడిగింది. దుకాణదారు ఉన్నాయని చెప్పినమీదట ఆమె బంగారు పాజేబులు చూప మన్నది. ఒక బానిస ఆమె పావడా అంచు పైకెత్తి పాదం ప్రదర్శించింది. అంత చిన్న పాదం చూసి దుకాణదారు నిర్ఘాంతపోయి, "నా దగ్గిర వున్న చిన్న పాజేబులుకూడా చాలా వొదులవుతాయి. ఎలాగ?" అన్నాడు.

"అదేమిటి? నావి ఏనుగు కాళ్ళంటారే?" అన్నదా యువతి ఆశ్చర్యపోతూ.

"ఎవరా అనేది? పురుగులుపడిపోతారు. చక్కని గువ్వలాటి పాదం! బుల్లి పాదం!" అన్నాడు దుకాణదారు, పారవశ్యంతో.

"పోనీ, చేతులకు కంకణాలేమైనా ఉన్నాయా?" అన్నదామె. బానిస ఒకతె ఆమె చేతులమీది బట్ట తొలగించేసరికి దుకాణదారు మరీ నిర్ఘాంతపోయాడు.

"నా దగ్గిర ఉన్న కంకణాలలో అతి చిన్నదికూడా ఈ చేతులకు వొదులవుతుంది," అన్నాడతను.

"అదేమిటి? నా వేళ్లు అరటికాయల్లాగా ఉంటాయనీ, చేతులు ఏనుగుతొండాల్లాగా ఉంటాయనీ అంటారే?" అన్నది యువతి.

"అటువంటి మాటలనేవాళ్ళు నాశనమైపోతారు. సుందరీ, నీవంటి అందగత్తె ముూడు లోకాలలోనూ లేదు. నన్ను పెళ్లాడి ధన్యుణ్ణి చెయ్యవా?" అంటూ దుకాణదారు ఆమెముందు మోకరించి, కన్నీటి పర్యంతమై వేడుకున్నాడు.

ఆమె చిరునవ్వు నవ్వింది. "మా నాన్నకు నేనంటే ఎంత కోపమో! నాది చిత్రబొచ్చుట, వికారమైన ముఖంట, గొగ్గిపళ్ళుట, మొహమంతా స్ఫోటకం మచ్చలుట! నన్నెవరూ పెళ్ళాడరుట! నేను అందంగా ఉన్నానని నువు చెబితే నాకు నిజంగా సంతోషంగా ఉంది!" అన్నది.

"మీ నాన్నకేదో పిచ్చి అయిఉంటుంది. ఆయన పేరేమిటో చెప్పు. నే నాయన

దగ్గిరికి వెళ్లి నిన్ను పెళ్లాడతానని ప్రమాణం చేస్తాను," అన్నాడు దుకాణదారు.

"ఆయన పేరు షేక్ అల్ ఇస్లామ్. ఆయన ఈ నగరపు వర్తకులలో ప్రసిద్ధుడు. నువు నన్ను పెళ్ళాడతానంటే ఆయన వెంటనే ఒప్పుకోడు. నా అనాకారితనం వర్ణించి నిన్ను బెదరగొడతాడు. అన్నిటికీ నువు, 'నాకు సమ్మతమే!' అనాలి," అన్నదా యువతి.

"నే నాయన్ని ఎప్పుడు కలుసుకునేది?" అన్నాడు దుకాణదారు.

"రేపు పదిగంటలకు," అని ఆమె బానిసలతో సహా వెళ్ళిపోయింది.

మర్నాడు ఉదయం పదిగంటలకు నగల వర్తకుడు షేక్ అల్ ఇస్లామ్ భవనం ఎక్కడ ఉన్నదీ కనుక్కొని ఆయన్ను చూడబోయాడు.

అల్ ఇస్లామ్ యువకుడి కోరిక విని విచారంగా, "నీకు నా కుమార్తె సంగతి తెలియదల్లే ఉంది, నాయనా! అది అభాగ్యురాలు. అది పగలు చూస్తే రాత్రి కలలోకి వస్తుంది," అని తన కుమార్తె అనాకారితనం చాలా సేపు వర్ణించాడు. ఆయన మాట్లాడుతున్నంతసేపూ యువకుడు, "నాకు సమ్మతమే! నాకు సమ్మతమే!" అంటూవచ్చాడు.





ఇక చెప్పేదేమీ లేక అల్ ఇస్లామ్ ఆ యువకుడికి తన కుమార్తె నివ్వటానికి సమ్మతించాడు. యువకుడిచేత ఒప్పందం రాయించి సాక్షిసంతకాలు చేయించాడు. వధువును వరుడు అన్ని లోపాలతోనూ భార్యగా స్వీకరించేటట్టూ, ఆమెకు విడాకు లివ్వగోరే పక్షంలో ఇరవై వేల దీనారాల బంగారం పరిహారంగా భార్యకు చెల్లించేటట్టూ పత్రంలో రాయించారు.

"పెళ్ళికూతురు రోగిష్ఠిది. మంచం దిగలేదు. అందుచేత పెళ్ళి ఇక్కడే జరగాలి!" అన్నాడు అల్ ఇస్లామ్. మరీ మంచిదన్నాడు నగల వర్తకుడు.

పెళ్ళి అయిపోయింది. నగల వర్తకుడు తన భార్య ఉన్న గదిలోకి వెళ్ళి ఆమె ముఖంమీద వేసుకున్న మేలిముసుగు తొలగించి చూచాడు. అతని గుండె ఆగిపోయింది. పెళ్ళికూతురు వట్టి కురూపి. ఇంతకుముందు దుకాణానికి వచ్చి నగలు బేరంచేసిన పిల్ల కానేకాదు.

తనకింత ఘోరం ఎందుకు జరిగిందో తెలియక నగలవర్తకుడు తన ఇంటికి తిరిగి వచ్చేశాడు. మర్నాడు తను దుకాణంలో కూచుని, విచారంలో మునిగి ఉండగా మొదట వచ్చిన యువతి తన బానిసలతోసహా వచ్చి, "పెళ్ళికొడుకుకు శుభం కలగాలి! సౌఖ్యం కలగాలి!" అన్నది.

యువకు డామెను తిట్టనారంభించాడు. ఆమె ఆశ్చర్యం నటిస్తూ, "నేను పంపిన గీతమూ, నా నీగ్రో బానిసపిల్లా జ్ఞాపకం లేవా?" అన్నది. ఆమె లేచి వెళ్ళిపోబోతుండగా యువకుడు లేచి, ఆమె కాళ్ళమీద పడి, "నాకు బుద్ధివచ్చింది. నన్ను ఎట్లాగైనా ఈ నరకంనుంచి బయట పడెయ్యి," అని వేడుకున్నాడు.

ఆమె అతనిని చూసి జాలిపడి అతనికి ఒక ఉపాయం చెప్పి వెళ్ళిపోయింది. ఆమె చెప్పినప్రకారం అతను కొన్ని ఏర్పాట్లు

ముగించి నేరుగా తన మామగారయిన అల్ ఇస్లాం ఇంటికి వెళ్ళాడు. అక్కడ వసారాలో మామా, అల్లుడూ సుఖాసీనులై ఉండగా, తలవాకిలి తలుపు తోసుకుని అంతులేని అలగా జనం లోపలికి వచ్చారు. కొందరు తప్పెటలు వాయించారు, కొందరు ఈలలు వేశారు, కొందరు సాముగరిడీలు చేశారు, కొందరు కోతులనూ, యెలుగుబంట్లనూ ఆడించారు.

అల్ ఇస్లాం లేచి అరుస్తూ, "ఏమిటీ అల్లరి? ఆపండి!" అన్నాడు. కాని నగల వర్తకుడు ఆగమన్నదాకా వాళ్లు ఆగలేదు.

తరవాత ఆ యువకుడు అల్ ఇస్లామ్ కేసి తిరిగి, "మామా, వీళ్ళంతా నా బంధువులూ, దాయాదులూనూ! నేను పెళ్ళాడానని తెలిసి సంబరం చెయ్య వచ్చారు. మరేమీ లేదు!" అన్నాడు.

అల్ ఇస్లామ్ తెల్లబోయి, "వీళ్లా నీ బంధువులు? ఈ సంగతి ముందుగా తెలిస్తే నా పిల్లనివ్వక పోదునే!" అన్నాడు.

"నన్నడిగితే నేను మొదటే చెప్పి ఉందును," అన్నాడు యువకుడు.

"అడక్కపోయినా చెప్పవలసింది. నువు రాసి ఇచ్చిన పత్రం చెల్లదు. నేను ఒప్పను!" అన్నాడు అల్ ఇస్లామ్.

"నేను నా భార్యను చచ్చినా వదలను. మీరేం చేస్తారో నేనూ చూస్తాను," అన్నాడు యువకుడు కోపంనటిస్తూ.

అల్ ఇస్లామ్ కాళ్ళ బేరానికి వచ్చి, "బాబూ, బాబూ! నా పరువు కాపాడితివా, అల్లా నిన్ను కాపాడతాడు. నా కూతురికి విడాకులిచ్చెయ్యి!" అన్నాడు.

బలవంతాన ఇస్తున్నట్టుగా యువకుడు తన భార్యకు విడాకులిచ్చి బయటపడ్డాడు. ఆ తరవాత అతను తాను ప్రేమించిన సుందరిని పెళ్లాడాడు. ఆమె కైరో సుల్తాను దగ్గిరబంధువురాలని తెలియగానే అతని సంతోషానికి మేరలేక పోయింది.





# చేయని నేరం

పూర్వం అవంతీనగరంలో ఒక రాజుండే వాడు. ఒకనాటి సాయంకాలం ఆయన తన మేడపైభాగాన విహరిస్తూండగా, ఒక పక్క ఉన్న డాబామీద ఆయనకొక అంద గత్తె అయిన స్త్రీ కనిపించింది. రాజుగారు వివేకీ, న్యాయబుద్ధీ అయినవాడే. అయినా ఆ స్త్రీ సౌందర్యం చూడగానే ఆయనకు ఆమెపై కోరిక కలిగింది.

ఆయన వెంటనే పనివాళ్ళను పిలిచి, ఆడాబా ఎవరిదని అడిగాడు.

"చిత్తం, మహాప్రభూ! అది తమ దగ్గిర కొలువుచేసే వీరభద్రుడు అనే వాడిది," అన్నారు నౌకర్లు.

"వీరభద్రుణ్ణి ఒకసారి పిలవండి," అన్నాడు రాజు.

వీరభద్రుడు రాగానే రాజు అతని చేతికి ఒక ఉత్తరం ఇచ్చి, "ఏమోయ్, దీన్ని తీసుకుని వెళ్ళి ఫలాని నగరంలో ఫలాని వారికిచ్చి జవాబు తీసుకురావాలి. రేపు ఉదయమే బయలుదేరి వెళ్ళు!" అన్నాడు.

"చిత్తం, మహాప్రభూ!" అని వీర భద్రుడు రాజుగారిచ్చిన ఉత్తరం తీసుకుని తన ఇంటికి వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం వీరభద్రుడు ఇల్లు వదిలి వెళ్ళేదాకా కనిపెట్టుకుని ఉండి, తరవాత రాజుగారు ఒంటరిగా వీరభద్రుడి ఇంటికి వెళ్ళాడు.

వీరభద్రుడి భార్య తమ ప్రభువుకు చేయదగిన మర్యాదలన్నీ చేసి, "మీరు మా ప్రభువులు, కాని మాకు రక్షకుడు ఆ భగవంతుడే!" అన్నది.

"ఎందుకలా అన్నావు?" అన్నాడు రాజు.

"మీరెందుకు దయచేశారో నాకు తెలుసును. కాని నాకు ఒకటే సందేహం— మృష్టాన్నభోజనాలు చేసేవారికి ఎంగిలి కూడుమీద భ్రమ ఎందుకా అని!" అన్నది

జి. నారాయణస్వామి



వీరభద్రుడి భార్య; మర్యాదగానూ, మెత్తని చెప్పుతో కొట్టినట్టుగానూ.

ఈ మాట వినగానే రాజుకు ఎంతో అవమానమయింది. ఆయన చివాలున లేచి తన పాదరక్షలుకూడా తొడుక్కోకుండా తన భవనానికి తిరిగి వెళ్ళిపోయాడు.

రాజకార్యంమీద కొంతదూరం వెళ్ళిన వీరభద్రుడు, తాను ఉత్తరం తీసుకోకుండా బయలుదేరినట్టు తెలుసుకుని, ఇంటికి తిరిగి వచ్చాడు. వసారాలో అతనికి రాజుగారి పాదరక్షలు కనిపించాయి. తనను రాజుగారు ఎందుకు పంపినదీ గ్రహించాడు. భార్యకు కనిపించనైనా కనిపించక, మరిచిపోయిన ఉత్తరం తీసుకుని, తిరిగి గుర్రమెక్కి అతను వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళవలిసిన చోటికి వెళ్ళి, ఇవ్వవలసినవారికి ఉత్తరం ఇచ్చి, జవాబు తీసుకుని తిరిగివచ్చి రాజుగారికి సమర్పించుకున్నాడు. రాజుగారు అతనికి అప్పుడే నూరు మొహరీలు పారితోషికం ఇచ్చి పంపించేశాడు.

వీరభద్రుడు ఆ సొమ్మంతా కమసాలి దగ్గిరికి తీసుకుపోయి, ఆ విలవకు సరిపడా నగలు కొని ఇంటికి తిరిగివచ్చి, వాటిని భార్య కిచ్చి పెట్టుకోమన్నాడు. ఆమె అందాన్ని ఆ నగలు రెట్టింపుచేశాయి.

"ఇవి రాజుగారి అనుగ్రహంవల్ల లభించిన ఈనాం. వీటిని పెట్టుకుని మీవాళ్ళ వద్దకు వెళ్ళు!" అన్నాడు వీరభద్రుడు.

"మావాళ్లవద్దకు దేనికీ?" అన్నది భార్య.

"దేనికేమిటి? రాజుగారికి మనమంటే ఎంత అభిమానమో నలుగురికీ తెలియవద్దా?" అన్నాడు వీరభద్రుడు.

"సరే, అయితే అలాగే వెళతాను!" అని వీరభద్రుడి భార్య పుట్టింటికి ప్రయాణమయింది.

ఆమె పుట్టింటిదగ్గిర నెలరోజులున్నది. కాని ఆమెను తీసుకుపోవటానికి వీర

భద్రుడు వెళ్ళలేదు. కనీసం, మరెవరి నన్నా పంపలేదు. అధమం, తన క్షేమ సమాచారాలైనా కబురుచెయ్యలేదు.

నెల నిండగానే వీరభద్రుణ్ణి బావమరిది చూడ వచ్చాడు. మాటల ధోరణిని బట్టి, వీరభద్రుడు తన భార్యను వదిలిపెట్టే ఉద్దేశంతో ఉన్నట్టు బావమరిదికి స్పష్టమయింది. అతడికి చాలా కోపంవచ్చింది.

"ఇన్ని మాట లెందుకు? నువు మా చెల్లెలిని మర్యాదగా తెచ్చి ఏలుకుంటావా? రాజుగారిదగ్గిర ఫిర్యాదు చెయ్యమన్నావా?" అన్నాడు బావమరిది.



"నీ చెల్లెల్ని మొగుడు వదిలివేశాడని దివాణమంతా తెలియాలంటే ఫిర్యాదు చేసుకో. నామటుకు నేను గుట్టురట్టు కాకుండా ప్రవర్తించాను. తరవాత నీ యిష్టం!" అన్నాడు వీరభద్రుడు.

"ఎట్లా ఫిర్యాదు చెయ్యాలో నాకూ ఆమాత్రం తెలుసులే! చూద్దువుగాని," అన్నాడు బావమరిది.

ఒక రోజున వీరభద్రుడికి దర్బారు నుంచి పిలుపు వచ్చింది. రాజుగారి సింహాసనానికి సమీపంలోనే న్యాయాధికారి కూచుని ఉన్నాడు. ఆయన వీరభద్రుడి బావమరిదిని పిలిచి, "ఫిర్యాదు చేస్తున్నది నీవేకదా? నీ ఫిర్యాదు సభవారికి విన్నవించు," అన్నాడు.

బావమరిది ఈ విధంగా చెప్పాడు:

"ఏలినవారు న్యాయం చిత్తగించాలి. మా కొక ముచ్చటైన తోట ఉండేది. దానిని ఎత్తయిన గోడలమధ్య ప్రాణంతో సమంగా పెంచుకున్నాం. చక్కగా పెరిగి పూలతో, పళ్ళతో కళకళలాడుతున్న ఆ తోటను ఈ వీరభద్రుడికి వప్పగించి, జాగ్రత్తగా రక్షించి అనుభవించుకోమన్నాం. ఈ వీరభద్రుడు ఆ తోటను కొంతకాలం పాటు యథేచ్ఛగా అనుభవించి, చివరకు గోడలన్నీ కూలదోసి తోటను గాలికి వదిలి

వేశాడు. తనకిక ఆ తోటతో పనిలేదనీ, కావలిస్తే మేం పుచ్చుకోవచ్చుననీ ఇదేమైన ధర్మమేనా?"

"ఇది నిజమేనా? ఈ ఆరోపణకు నువ్వేమంటావు, వీరభద్రా?" అన్నాడు న్యాయాధికారి.

వీరభద్రుడు ఈ విధంగా చెప్పాడు:

"తోటను నేను మొదట తీసుకున్న మాటా, తిరిగి వదిలివేసిన మాటాకూడా నిజమే. కాని నేనా పని ఇష్టమై చెయ్యలేదు, ఒకరి ప్రోద్బలంమీదా చెయ్యలేదు. జరిగినదేమంటే, ఒకనాడు నేను తోటలో ప్రవేశించేసరికి నాకక్కడ సింహంపాదాల గుర్తులు కనబడ్డాయి. ఇక ఆ తోట నాకు క్షేమకరం కాదనిపించింది. సింహంపట్ల నాకు గల గౌరవభావమూ, నా ప్రాణాలపై నాకు గల తీపీ చేరి నాచేత ఈ పని చేయించాయి. నేను చేసిన తప్పేమిటో ఏలినవారు సెలవియ్యాలి."

ఇంతవరకూ మౌనంగా వింటున్న రాజు అడ్డువచ్చి, "వీరభద్రా, నువు అపోహ పడ్డట్టు కనిపిస్తున్నది. ఆ తోట సంగతి నాకూ తెలుసును. పొరపాటున సింహం అందులో అడుగుపెడితే పెట్టిందేమోగాని అక్కడ ఆ సింహానికి ఏం దొరుకుతుంది? ఒక్క పువ్వుగాని, ఫలంగాని, చిగురాకు గాని అంటకుండా, తనకది చోటుకాదని తెలుసుకుని, ఆ సింహం అప్పుడే వెళ్ళిపోయిఉంటుంది. సింహానికి వెరిచి నువు నీ ప్రియమైన తోటను గాలికి వదలవలసిన అవసరం కొంచెమైనా లేదు. అందుచేత నువు నీ బావమరిదితో రాజీపడి, నీ తోటను తిరిగి తీసుకో" అన్నాడు.

ఈ మాటలు వీరభద్రుడికి తప్ప సభలో ఇంకెవ్వరికీ అర్థంకాలేదు. అవి విని వీరభద్రుడు ఎంతో సంతోషించాడు. అతను తన భార్యను పుట్టింటినుంచి తిరిగి తెచ్చుకుని సుఖంగా జీవించాడు.





# మిత్రద్రోహి

పూర్వం అలెగ్జాండ్రియా నగరంలో అబూకీర్ అనేవాడికి కలంకారీ దుకాణం ఒకటి ఉండేది. వాడు కావటానికి మంచి పనివాడే గాని మోసగాడు, సోమరిపోతు, బొత్తిగా నీతిమాలినవాడు. రంగు వెయ్యమని ఎవరన్నా బట్టలిస్తే రంగులకని ముందుగా సొమ్ము తీసుకుని, బట్టలు అమ్మేసి, అదంతా పెట్టి సుఖంగా భోంచేసేవాడు. బట్టలిచ్చిన వారిని తెగతిప్పి చివరకు, అద్దకం వేసిన బట్ట లెవరో అపహరించినట్టు చెప్పేవాడు.

కొంతకాలానికి అబూకీర్ అంటే యెటువంటివాడో చాలామందికి తెలిసిపోయింది. అప్పటికీ తెలియని వాళ్ళెవరన్నా వస్తే మోసంచేస్తూనే ఉండేవాడు. వాడు తన దుకాణం తెరవటంకూడా మానేసి, దానికెదురుగా ఉండే మంగలి దుకాణంలో కూర్చోవటం మొదలుపెట్టాడు. వాడివల్ల మోసపోయినవారు వచ్చిచూసి, దుకాణం మూసివుందని వెళ్ళిపోయేవారు. ఎవరైనా కొత్తవాళ్ళు బట్టలు పట్టుకునివస్తే అబూకీర్ బేరం తీసుకుని ఆ బట్టలు అమ్మేసి చిద్విలాసంగా ఖర్చుపెట్టుకునేవాడు.

ఇట్లా ఎంతకాలం సాగుతుంది? ఒకనాడెవరో అబూకీర్ షాపుకు జప్తు పెట్టారు. రాజభటులు తన దుకాణానికి సీళ్ళువెయ్యటం మంగలిషాపులోనుంచి అబూకీర్ చూశాడు.

మంగలిషాపు గలవాడి పేరు అబూసీర్. అతను చాలా పెద్దమనిషి, శాంతమూర్తి. అతను అబూకీర్‌తో, "ఎందుకు వచ్చిన ప్రారబ్ధం? అక్రమంగా ఎంతకాలం వృత్తి చేసుకొగలవు? అల్లా ఇచ్చేదానితో తృప్తిపడి న్యాయంగా బతకరాదా?" అన్నాడు.

"నన్నేం చావమంటావా? ఎంత కష్టపడి చేసినా తిండికే చాలకపోయె! నీకు నిక్షేపంగా జరిగిపోతున్నది గనక కబుర్లు చెబుతావు," అన్నాడు అబూకీర్.

డి. శివరామకృష్ణయ్య



"లేదు, తమ్ముడూ. నాకుకూడా ఏమీ బాగా జరగటం లేదు. పోనీ, ఈ నగరం విడిచి ఎక్కడికైనా పోయి, ఇంతకన్న సుఖంగా బతకగలమేమో చూద్దాం," అన్నాడు అబూసీర్.

దీనికి కలంకారీవాడు ఒప్పుకున్నాడు. ఇద్దరూ ఫతేహా జపించి ప్రమాణం చేసుకున్నారు: ఇద్దరిలో ఎవరు ముందు సంపాదించినా రెండోవారిని భరించాలి; ఒకరు ఎక్కువ సంపాదించినా తక్కువ సంపాదించినా ఇద్దరూ సమంగా పంచుకోవాలి.

మర్నాడు ఉదయమే వారిద్దరు రేవుకు వెళ్ళి, ఒక పడవ పట్టుకున్నారు. వారు తమవెంట కొద్ది ఆహారమే తెచ్చుకున్నారు. అందుచేత మంగలి, పడవలో వున్నవారికి క్షౌరంచేసి, డబ్బుకు బదులు ఆహారం స్వీకరించి, దానితో తమ ఇద్దరి పొట్టలూ నింపటానికి నిశ్చయించుకున్నాడు.

పడవలో మంగలి అబూసీర్ ఒకడే. అతను పొదితీసుకుని ప్రయాణీకుల మధ్యకు వెళ్ళేసరికి కొందరు అతనిచేత క్షౌరం చేయించుకున్నారు. అందరి దగ్గిరా అతను ఆహారమే పుచ్చుకున్నాడు. కొందరు రొట్టెలూ, కూరా మొదలైనవి ఇచ్చారు. మరి కొందరు చిల్లరడబ్బులుకూడా ఇచ్చారు.

పడవమీద మంగలి ఉన్నట్టు తెలియగానే సరంగు అతనికోసం కబురుచేశాడు. అబూసీర్ సరంగుకు క్షౌరంచేసి, డబ్బిచ్చుబోతే తీసుకోక, తమ కథ యావత్తూ అతడికి చెప్పుకున్నాడు.

"అయితే, భోజనంవేళకు నీ మిత్రుణ్ణి కూడా వెంటబెట్టుకురా. వంటచేయిస్తాను. నాతోనే భోంచేద్దురుగాని," అన్నాడు సరంగు.

మంగలి సంతోషించి, తాను సంపాదించిన ఆహారమంతా మూటకట్టుకుని, కలంకారీవాడున్న చోటికి తిరిగివెళ్ళాడు. ఆ సోమరిపోతు పడవ ఎక్కినది మొదలు అట్లాగే పడుకుని నిద్రపోతున్నాడు. అబూ

సీర్ వచ్చి లేపగా వాడు, "ఏమీ అనుకోకు, అన్నా. నాకు చాలా పైత్యవికారంగా వుంది. లేచి నిలబడలేను," అంటూ, మంగలి తెచ్చిన రొట్టెలూ, కూరా గబగబా నోట కుక్కుకోసాగాడు.

"ఇవెందుకు తింటావు? మనిద్దరినీ సరంగు భోజనానికి రమ్మన్నారు. వేళ కావచ్చిందికూడా," అన్నాడు అబూసీర్.

"నే నెట్లా రాను? లేస్తేనే ఒళ్ళు తూలుతుంది," అంటూ అబూకీర్ తన పొట్ట ఆత్రంగా నించుకున్నాడు.

మంగలి ఒక్కడే రావటం చూసి సరంగు, "నీ స్నేహితుడెక్కడ?" అన్నాడు.

"అతనికి ఒళ్ళు తిప్పుతున్నదిట," అని జవాబిచ్చాడు మంగలి. భోజనాలయాక సరంగు ఒక పళ్ళెం నిండా భోజనపదార్థాలు పెట్టించి, కలంకారీవాడి కోసం మంగలి వెంట పంపాడు.

మంగలి కష్టపడి సంపాదించిన ఆహారం యావత్తూ ఖాళీచేసి నిద్రపోతున్న అబూకీర్ నిద్రలేచి, సరంగు పంపించిన పళ్ళెంకూడా ఖాళీచేసి మళ్ళీ నిద్రకు పడ్డాడు.

ఈ విధంగా ఇరవై రోజులు సముద్రం మీద ప్రయాణంచేసి పడవ ఒక నగరం చేరింది. ఇద్దరు స్నేహితులూ పడవ దిగి, నగరంలోకి వెళ్ళి, ఒక సరాయిలో గది





అద్దెకు తీసుకున్నారు. అందులో ప్రవేశించినది మొదలు కలంకారీవాడు ఒకటే నిద్ర.

మంగలి అబూసీర్ మాత్రం బయటికి వెళ్లి తనవృత్తి చేసుకుని, కూరానారా కొనుక్కుని ఇంటికి వచ్చేవాడు, వంట చేసేవాడు, స్నేహితుడికి పెట్టి తాను తినేవాడు. అబూకీర్ భోజనానికి మాత్రం నిద్రలేచి, మళ్లీ వెంటనే పడుకుని నిద్రపోయేవాడు. అబూసీర్ అతనితో "ఏమిటీ సోమరితనం?" అని ఎన్నడూ అనలేదు. పైపెచ్చు, తనకు పనిలేకపోయినా నగరం వినోదాలు చూడటానికి బయటికి పోతూ, "నేను పోతున్నాను, నువు విశ్రాంతితీసుకో!" అనేవాడు.



ఈ విధంగా నలభైరోజులు గడిచాయి. నలభైఒకటో రోజున మంగలి అబూసీర్‌కు జబ్బుచేసింది. అతను సరాయ్ నౌకరును బతిమాలి, అతనిద్వారా తనకు కావలిసిన తిండీ అదీ తెప్పించాడు. అబూకీర్ మటుకు ఇంకా తింటూ, నిద్రపోతూ ఉన్నాడు.

మరి నాలుగురోజు లీవిధంగా జరిగినాక అబూసీర్ జ్వరం, తీవ్రమై అతనికి అపస్మారకస్థితి ఏర్పడింది. అందుచేత అతను సరాయి నౌకర్ను పిలిచి డబ్బులిచ్చి బజారు నుంచి తిండి తెప్పించలేదు.

వేళకు తిండి రాకపోయేసరికి కలంకారీ అబూకీర్‌కు అకలి దహించసాగింది. అతను లేచి అబూసీర్ చొక్కా వెతికాడు. అందులో కొంత డబ్బు దొరికింది. అది చేతబట్టుకుని ఎవరికీ చెప్పకుండా, గది తలుపు మూసి, అబూకీర్ నగరంలోకి వెళ్ళిపోయాడు.

నగరం చాలా దివ్యంగా ఉంది. కాని ఒక చిత్రం కనిపించింది. ఆ నగరంలో ఏ మనిషిచూసినా తెల్లదుస్తులు, నీలిరంగు దుస్తులు వేసుకుని కనబడ్డారేగాని ఇతర రంగుల దుస్తులతో ఎవరూ కనిపించలేదు. దానికి కారణం తెలుసుకుందామని అబూకీర్ అక్కడ ఒక కలంకారీ దుకాణానికి వెళ్లి, "నా చేతిరుమాలుకు రంగువెయ్యాలి.







ఏరంగు వేస్తారు. ఎంత పుచ్చుకుంటారు?" అని దుకాణదారును అడిగాడు.

"నీలిరంగు వేస్తాం. ఇరవై వెండి కాసులు పుచ్చుకుంటాం," అన్నాడు దుకాణంవాడు.

కొంచెంసేపు సంభాషించిన మీదట అబూకీర్‌కు ఆ పూరి రహస్యం తెలిసిపోయింది. అక్కడ నీలిరంగు చౌకగా దొరుకుతుంది. ఆ పూరి కలంకారీవాళ్ళకు మరొక రంగు వెయ్యటం చేతకాదు. వారు అంతేసి మజూరీ పుచ్చుకోవటానికి కూడా కారణం ఉంది. ఆ నగరంలో కలంకారీ పనిచేసే వారు నలభైమందే ఉన్నారు. వారంతా కట్టుగా నిలబడి కొత్తవారి నెవర్నీ ఆ వృత్తిలోకి రానివ్వకుండా అడ్డుకుంటున్నారు. నలభైమందిలోనూ ఎవరైనా చస్తే, వారి పిల్లల్లో ఎవరో ఒకరికి కలంకారీపని నేర్పి ఆ వృత్తి చేసుకోనిస్తారు.

ఈ విషయాలన్నీ తెలుసుకుని అబూకీర్ నేరుగా ఆ నగరపు రాజుగారివద్దకు వెళ్ళాడు. తనకు కలంకారీపని తెలుసుననీ తాను బట్టలకు ఏ రంగు కావాలంటే ఆ రంగు వేయగలననీ, అందుచేత తనకు కలంకారీ దుకాణం పెట్టుకునే అవకాశం ఇప్పించమనీ అడిగాడు.



రాజు, ఈ మాటవిని ఆశ్చర్యపోయి అబూకీర్ కలంకారీ దుకాణం పెట్టుకునేందుకు అనుమతి ఇవ్వటమేగాక, పెట్టుబడికి అయిదువేల బంగారు కాసులూ, సహాయపడేటందుకు కొందరు బానిసలూ, ఉచితంగా ఇల్లూ ఇప్పించాడు.

అబూకీర్ ఆ దుకాణంలో తనకు కావలిసిన సరుకుసరంజామా అంతా ఏర్పాటు చేసి, రాజుగారు పంపిన తానులకు రకరకాల రంగులు వేసి, దుకాణం ముందర అట్టహాసంగా ఆరగట్టాడు. జనం విడ్డూరంగా ఎగబడి రంగురంగుల బట్టలకేసి నోళ్ళుతెరుచుకు చూడసాగారు.







"నా చొక్కాలో డబ్బుంటుంది, తీసుకు పోయి నాకేదైనా తాగేటందుకు తెచ్చిపెట్టు బాబూ," అన్నాడు అబూసీర్.

కాని చొక్కా జేబు ఖాళీగా వుంది. అబూకీర్ ఏమయాడో తనకు తెలియదన్నాడు నౌకరు. అబూకీర్ తనకు ద్రోహం చేసి వెళ్ళిపోయాడని తెలుసుకుని అబూసీర్ కంట తడిపెట్టాడు. నౌకరు అతన్ని ఓదార్చి, అతని కింత జావ తానే కాచిపోసి, తన డబ్బుతోనే అతన్ని పోషిస్తూ సమస్తమైన సేవా చేశాడు. చివరకు ఒకనాడు అబూసీర్‌కు ఒళ్లంతా చెమటలుపట్టి జ్వరం దిగిపోయింది. అతను సరాయి నౌకరుకు తన కృతజ్ఞత తెలుపుకుని, అల్లా అనుగ్రహిస్తే త్వరలోనే ఋణం తీర్చుకుంటానని చెప్పి బయలుదేరాడు.

మంగలి అబూసీర్ వీధులవెంట కొద్ది దూరం వెళ్ళాడోలేదో అతనికి ఒక కలంకారీ దుకాణమూ, దాని బయట అరగట్టిన రంగు రంగుల బట్టలూ, వాటిని చూడటానికి మూగిన జనమూ కనిపించారు. అది అబూకీర్ దుకాణమని తెలియగానే మంగలికి పరమానందమయింది. పని తొందర వల్లనే అతను తనను తిరిగి కలుసుకోలేకపోయాడనికూడా అనుకున్నాడు.

వాటినిచూసి రాజుగారు పొందిన ఆనందానికి మేరేలేదు. ఆయన అబూకీర్‌మీద కనకవర్షం కురిపించాడు. గొప్పగొప్ప రాజోద్యోగులందరూ తమ బట్టలను అబూకీర్ వద్దకు పంపి రకరకాల రంగులు వేయించుకున్నారు. చూస్తుండగానే కలంకారీ అబూకీర్ అధికారమూ, సంపదా కూడా అంతులేకుండా పెరిగిపోయాయి.

అక్కడ సరాయిలో మంగలి అబూసీర్‌కు మూడురోజులపాటు స్పృహరాలేదు. గది తీసుకున్నవారు ఏమయారో చూద్దామని నౌకరువచ్చిచూసేసరికి అబూసీర్ మూలుగుతున్నాడు. అతనికి అప్పుడేస్పృహవచ్చింది.

అబూసీర్ దుకాణంలోకి తొంగిచూసే సరికి అబూకీర్ లోపల కూచుని వైభవంగా కనిపించాడు. అయితే అబూకీర్ తన స్నేహితుణ్ణి చూడగానే సంతోషంతో లేచివచ్చి కౌగలించుకోకపోగా ఆగ్రహంతో గొంతెత్తి, "తప్పుడు వెధవా! మళ్ళీ వచ్చావ్? నీ దొంగమొహం ఇక్కడ చూపించవద్దని ఎన్ని సార్లు చెప్పాను?" అని అరిచాడు.

మరుక్షణమే అబూకీర్ బానిసలు వచ్చి అబూసీర్‌ను పట్టుకున్నారు. అబూకీర్ లేచి వచ్చి అతన్ని తన కర్రతో గొడ్డును బాది నట్టు బాది, "నీ మొహం ఈసారి ఇక్కడ చూపించావో, రాజుగారితో చెప్పి నీ తల తీయించేస్తాను, జాగ్రత్త! పో అవతలికి!" అంటూ గెంటి వేశాడు.

అల్లా తనని పరీక్షిస్తున్నాడని తప్ప, అబూసీర్ ఇంకేమీ అనుకోలేకపోయాడు. అతనికి స్నానం చెయ్యాలని బలమైన కోరిక కలిగింది. కాని ఎంత దూరం వెళ్ళినా ఒక్క స్నానశాలకూడా కనిపించలేదు. అందుచేత అతను దారేపొయ్యేవాణ్ణి ఒకణ్ణి పిలిచి, "బాబూ, సమీపంలో స్నానశాల ఏదైనా ఉంటే అక్కడికి వెళ్ళేందుకు దారి చెబుదూ!" అని అడిగాడు.

"స్నానశాలా? అంటే ఏమిటి?" అని ప్రశ్నించాడు దారేపోయేవాడు.







"పురజనులు స్నానాలు చేస్తూంటారే, ఆ ప్రదేశం," అన్నాడు అబూసీర్.

"పురజనులయేది, రాజుగారయేది, స్నానం చెయ్యాలంటే సముద్రానికి పోవలిసిందే." అన్నాడు దారేవెళ్ళేవాడు.

ఈ దేశంలో స్నానశాలలు లేవనీ, వాటి సౌఖ్యాన్ని ఇక్కడి ప్రజ లెరగరని అబూసీర్‌కు అర్థమయింది. అతను నేరుగా రాజుగారివద్దకు వెళ్ళి, "ఇంత అందమైన నగరం వుండికూడా ఇక్కడ స్నానశాలలు లేవంటే ఇంతకంటె వేరే లోటుండదు," అన్నాడు. స్నానశాలలో ఎటువంటి ఏర్పాట్లుంటాయో అబూసీర్ వివరించి చెప్పిన మీదట రాజు, "బాగుంది. నీకు కావలిసినంత డబ్బిస్తాను. ఈ నగరంలో నీకు నచ్చిన చోటు చూసి ఆ ప్రాంతాన చక్కని స్నానశాల కట్టించి నడుపు. అది ఎట్లా నడుస్తుందో చూస్తాం," అన్నాడు.

రాజుగారి ప్రాపకంతో మంగలి అబూసీర్ నగర మధ్యంలో మంచిచోటు చూసి అక్కడ ఒక మనోహరమైన స్నానశాల కట్టించాడు. అందులో మధ్య అందంగా ఒక జలయంత్రం నిర్మించాడు. నీళ్ళ తొట్లూ, నీరు కాచటానికి యేర్పాట్లూ అమర్చాడు. రాజుగారు పంపిన బానిసలకు ఒళ్ళుపట్టటం మొదలైనవి నేర్పాడు.

స్నానశాల ప్రారంభోత్సవంనాడు రాజుగారూ, సామంతులూ వచ్చారు. వారికోసం స్నాన జలంలో అబూసీర్ పన్నీరు కలిపించాడు. నౌకర్లు అందరికీ ఒళ్ళుపట్టి, ఒళ్ళు రుద్ది, సుఖంగా స్నానాలు చేయించారు. అటువంటి సుఖం రాజుగారుగానీ, సామంతులుగాని వారి జన్మలో ఎరగరు.

రాజు పరమానందభరితుడై, "ఇటువంటి స్నానం చేయించినందుకు ఒక్కొక్కరిదగ్గిరా ఎంత పుచ్చుకోబోతున్నావు? వెయ్యి బంగారు కాసులకు తక్కువ తీసుకోకు," అన్నాడు.





అబూసీర్ సలాంచేసి, "తమరు ప్రభువులు కనక అంత సొమ్మివ్వగలరు. పేదవాళ్ళిచ్చుకోగలరా? ఈ సుఖం అందరికీ అందుబాటులో ఉండటానికై ఎవరు ఎంత మనస్ఫూర్తిగా ఇస్తే అంతే పుచ్చుకుందామనుకుంటున్నాను," అన్నాడు.

రాజుగారు వెయ్యి బంగారుకాసులూ, ఆయన వెంట వచ్చిన నాలుగువందల మందీ తలా నూరు బంగారుకాసులూ అబూసీర్ కిచ్చారు. అదే చాలా పెద్ద మొత్తమయింది.

మర్నాటినుంచీ మామూలు ప్రజలు తండోపతండాలుగా వచ్చి స్నానశాలలో స్నానాలు చేయసాగారు. ఎవరెంత ఇచ్చినా అబూసీర్ పుచ్చుకున్నాడు.

ఇంకొకనాడు స్నానశాలకు రాజుగారి పడవ సరంగు వచ్చాడు. అబూసీర్‌ను గుర్తించి పలకరించాడు. అబూసీర్ ఆయనకు చక్కగా స్నానంచేయించాడు. సరంగు అతనికి డబ్బివ్వబోయాడు గాని అబూసీర్ తీసుకో నిరాకరించాడు.

ఈలోపల స్నానశాలనుగురించి అందరూ మెచ్చుకోగా అబూకీర్ విన్నాడు. అతను స్వదేశంవిడిచి వచ్చాక స్నానశాల అన్నది ఎరగడు. అందుచేత అతను ఒకనాడు తన బానిసలందరినీ వెంటబెట్టుకుని అట్టహాసంగా స్నానశాలకు వచ్చాడు.

అబూకీర్‌ను చూడగానే అబూసీర్ ఎదురుగా వెళ్ళి ఆలింగనం వేసుకున్నాడు.

"అన్నా, మనం ఫతేహా పఠించి ప్రమాణం చేసుకున్నాంగదా, ఒక్కమారైనావచ్చి నన్ను చూసిపోలేవేం?" అన్నాడు కలంకారీ అబూకీర్, అప్యాయంగా.

"రాకేం, తమ్ముడూ? వచ్చాను. నన్ను పట్టుకుని చావగొట్టి, దొంగ అని తిట్టి సత్కరించావు!" అన్నాడు అబూసీర్.

అబూకీర్ ఆశ్చర్యంగా, "నేను కొట్టింది నిన్నా? ఎంత ఘోరం, ఎంత ఘోరం!



"అదంతా రాసిపెట్టి ఉంది జరిగిందనుకో. దాన్నిగురించి విచారించ నవసరం లేదు," అంటూ అబూసీర్ తాను ఈ స్నానశాల ఏర్పాటుచేసిన వైనమంతా తెలిపి, అబూకీర్ చేత తను దగ్గరవుండి మహా వైభవంగా స్నానం చేయించాడు.

స్నానం పూర్తిచేసి అబూకీర్ తన స్నేహితుడితో, "అంతా చాలా బాగుందిగాని ఒక్క లోపంచేశావు," అన్నాడు.

"ఏమిటది ?" అని అడిగాడు మంగలి అబూసీర్ ఆత్రంగా.

"ఉల్లిపాషాణమూ, సున్నమూ కలిపి నూరిన నలుగుకూడా ఉంటే నీ స్నానశాలకేలోటూ లేదుగదా !" అన్నాడు అబూకీర్.

"అరెరె, దానిమాటే మరిచానుసుమా ! రేపే ఆ నలుగుకూడా తప్పక ఏర్పాటు చేస్తాను," అన్నాడు అబూసీర్.

అబూకీర్ తన స్నేహితుడి దగ్గిర శలవు పుచ్చుకుని నేరుగా రాజుగారి దగ్గిరికి వెళ్ళి ఆయనతో ఈవిధంగా చెప్పాడు,

"మహారాజా, తమరు నమ్మిన బంటును గనక ఒక హెచ్చరికచేయవలసి ఉన్నది. తమరొక స్నానశాల కట్టించారు, బాగానే ఉన్నది. కాని అందులో తమరుంచిన మనిషి తమకు అపకారం తలపెట్టినవాడు.

చూశావా ? నీలాంటివాడే ఒక దొంగవెధవ రోజూ నా దుకాణానికి వచ్చి ఏదో ఒకటి కాజేస్తూ ఉండేవాడు. పోనీ పేదవాడుగదా అని మంచిగా ఎన్నోసార్లు చెప్పిచూశాను. చివరకు ప్రాణంవిసిగి ఒకనాడు కొట్టాను. అది నువేనని నేను కలలోకూడా అనుకోలేదు సుమా," అన్నాడు.

"నేను నీదుకాణానికి ఒకేసారి వచ్చాను. ఆనాడే నన్ను తన్ని పంపావు !" అన్నాడు అబూసీర్ విచారంగా.

"అరెరె, నువు ఫలానా అని చెప్పలేకపోయావా ? ఎంత ఘోరం జరిగిందీ !" అన్నాడు అబూకీర్.

తమర్ని విషంతో తుదముట్టించటానికే ఈ స్నానశాల కట్టించాడు, సందేహం లేదు. అతని కథ చెబుతా వినండి.

"అతనూ, నేనూకూడా మరొకదేశపు సుల్తానుకు బందీలుగా చిక్కాం. నేను వారి రాజ్యంలో కలంకారీ దుకాణంపెట్టి బట్టలకు చిత్రవిచిత్రమైన రంగులువేసి, సుల్తానుగారిని మెప్పించాను. అయన నాకు స్వేచ్ఛ ఇచ్చి పంపేశాడు. ఈ మంగలి మాత్రం భార్యాబిడ్డలతో సుల్తానుకు బందీ అయి బయటపడలేక పోయాడు. చివరకు ఒక షరతుపై ఆ సుల్తాను ఇతన్ని ఒక్కణ్ణీ వదిలిపెట్టాడు. ఆ షరతేమిటంటే అతను స్నానశాల ఏర్పాటుచేసి విషపు నలుగుపెట్టి మిమ్మల్ని తుదముట్టించటం. అతనీపని ముగించాక, ఆ సుల్తాను అతని భార్యాబిడ్డలను వదిలేస్తాడు. ఆ తరవాత ఆ సుల్తాను వచ్చి తమ రాజ్యం అపహరిస్తాడు. ఇందుకే మంగలి ఇక్కడ చేరాడు!"

"విషపు నలుగేమిటి? అబూసీర్ నాకే నలుగూ పెట్టించలేదే?" అన్నాడు రాజు.

"కనుకనే తమరింకా క్షేమంగా ఉన్నారు. ఎప్పుడో తమకు ఉల్లిపాషాణపు నలుగు పెడతాడు. తమ క్షేమంకోరి చెప్పాను. హెచ్చరికగా ఉండటం మంచిది," అని అబూకీర్ వెళ్లిపోయాడు.







రాజుకు అబూసీర్‌మీద ఉండిన ఆదర మంతా ఆగ్రహంగా మారింది. ఆయన మర్నాడే సపరివారంగా స్నానశాలకు వెళ్ళాడు. అబూసీర్ ఎంతో ఆదరంతో ఆయనకు స్వాగతం చెప్పి, తానే స్వయంగా ఆయనకు ఒళ్లుపట్టి, ఒకరకం పిండితెచ్చి ఆయనకు నలుగు పెట్టబోయాడు.

"ఏమిటది ?" అన్నాడు రాజు.

"నలుగుపిండి," అన్నాడు అబూసీర్.

రాజు దాన్ని తీసుకుని వాసన చూశాడు. ఉల్లిపాషాణం వాసన కొడుతున్నది. రాజు చివాల్నలేచి, తన భటులతో, "ఈ రాజ ద్రోహిని పెడరెక్కలు కట్టి దివాణానికి తీసుకురండి," అంటూ, తన దుస్తులు వేసుకుని స్నానం చేయకుండా వెళ్లిపోయాడు.

అబూసీర్‌ను భటులు దివాణానికి తీసుకుపోయేసరికి రాజుగారు తన పడవ సరంగుతో మాట్లాడుతున్నాడు. ఆయన సరంగుకు అబూసీర్‌ను చూపి, "ఈ ద్రోహిని తీసుకుపో. వాణ్ణి ఒక గోతంలో పెట్టి, అందులో రెండు మణుగులు సున్నపురాయి కూడా వేసి మూతికట్టి, నీ పడవలో వేసుకుని తీసుకురా. మిద్దెమీద కిటికీలో నేనుంటాను. నేను చూస్తూండగా సంచిని నీటిలో పడెయ్యి. ఈ దుర్మార్గుడు సున్నంతోవుడికి చావాలని మా నిర్ణయం!"

ఈ మాటలు వినగానే సరంగు గుండెలవిసిపోయాయి. కాని అతనికి, "చిత్తం!" అనటం తప్ప గత్యంతరంలేదు. అతను, పెడరెక్కలు విరిచికట్టివున్న అబూసీర్‌ను వెంటబెట్టుకుని తన ఇంటికి బయలుదేరాడు.

"ప్రభువుకు ఇంత ఆగ్రహం కలగటానికి నువ్వేం చేశావు? నువ్వెంతో పెద్దమనిషివనుకున్నానే!" అన్నాడు సరంగు.

"అల్లా సాక్షిగా నేనే పాపమూ ఎరగను. కాని ఏదో అపరాధం జరగకపోతే రాజు నన్ను శిక్షిస్తాడా? ఆయనకు నేనంటే ఎంతో ప్రేమ!" అన్నాడు అబూసీర్.

"ఏమైనా నాచేతిమీదిగా నీకీ ఘోర మరణం కలిగించలేను. నువు మా ఇంటి నుంచి రహస్యంగా బయలుదేరి సముద్రంలో ఉన్న దీవికి వల తీసుకువెళ్ళి, చీకటిపడినదాకా చేపలు పట్టుతూ కూచో. చీకటిపడగానే రాజుగారి వంటవాడు చేపల కోసం వస్తాడు. ఈలోపల నేను గోతంలో ఏదో దుంగపెట్టేసి, నీటిలోకి తోసేస్తాను. నిజం నిలకడమీద అదే బయలుపడుతుంది," అన్నాడు సరంగు.

సరంగు ఇంటినుంచి అబూసీర్ వల తీసుకుని, చేపలు పట్టటానికి దీవికి వెళ్ళిపోయాడు. సరంగు ఒక పెద్ద గోతంలో రెండు మణుగులు సున్నపురాయి వేసి అందులో ఒక దుంగపెట్టి, మూతి కట్టి, తన పడవలో వేసుకుని, తెడ్డువేస్తూ రాజభవనం ఎదురుగా వెళ్ళి పడవను నిలిపాడు.

పై కిటికీలో రాజు కూచుని ఉన్నాడు. ఆయన చెయ్యివిసిరి, గోతాన్ని నీటిలోకి తోసెయ్యమని సంజ్ఞ చేశాడు. ఆ సమయంలో ఆయన చేతినుంచి, ఒక వుంగరం తళతళా మెరుస్తూ నీటిలో పడిపోయింది. దాన్ని ఎవరూ గమనించలేదు. సరంగు గోతాన్ని నీటిలోకి తోసేశాడు.

సున్నపురాయికి నీరు తగులుతూనే బుడగలూ, వెచ్చని ఆవిరీ బయలుదేరింది.





అక్కడ దీవిలో అబూసీర్ పొద్దూకేదాకా వలవేసి చేపలు పట్టాడు. చాలా చేపలు దొరికాయి. అతనికి బాగా ఆకలివేస్తున్నది. అందుచేత ఒక చేపను కాల్చుకు తిని బయలుదేరుదామనే ఉద్దేశంతో అతను ఒక పెద్దచేపను తీసి కత్తితో కోశాడు. మరుక్షణం దానిపొట్టలో ఏదో తళతళలాడింది. తీసిచూస్తే రాజుగారి ముద్రిక!

ఆ ముద్రిక ఈ చేపలోకి ఎట్లావచ్చిందో, ఆ చేప తన వలలో ఎట్లా పడిందో, అన్నిచేపలలోనూ దానినే తానెందుకు కోయవలసివచ్చిందో అబూసీర్ అర్థంచేసుకోలేక, "అంతా అల్లా నిర్దేశం," అనుకున్నాడు.

అతను సరంగు ఇంటికి వెళ్ళి, అతడికి రాజముద్రిక చూపించి, "ఇది లేనందువల్ల రాజుగారికి చాలా ఇబ్బంది కలుగుతుంది. కనుక దీన్ని ఇప్పుడే తీసుకుపోయి రాజుగారికి ఒప్పచెపుతాను." అన్నాడు.

సరంగు భయపడ్డాడు. కాని అబూసీర్ "అల్లా అనుగ్రహం ఉన్నంతకాలం భయపడవలసిన అవసరమేమీ లేదు. నావల్ల జరిగిన ద్రోహమేమిటో ఈసారైనా రాజుగారి నడిగి తెలుకుంటాను," అన్నాడు.

అబూసీర్‌ను చూడగానే రాజు నిర్ఘాంతపోయి, "ఆ సంచీలోనుంచి ఎట్లా బతికి తప్పించుకు వచ్చావు?" అన్నాడు.

అబూసీర్ జరిగినదంతా చెప్పి, ముద్రిక తీసి రాజుగారికిచ్చాడు.

"నిన్ను చూస్తే మంచివాడివిగా, రాజభక్తికలవాడివిగా కనిపిస్తావు. నన్ను చంపటానికి ఎందుకు యత్నించావు?" అని అడిగాడు రాజు ఆశ్చర్యపడుతూ.

"తమకెవరో నామీద చాడీలు చెప్పి ఉంటారు. నేను అటువంటి ద్రోహం ఎన్నడూ తలపెట్టలేదు," అన్నాడు అబూసీర్.

"ఎవరో కాదు, కలంకారీ వర్తకుడు అబూకీర్ స్వయంగా చెప్పాడు. నీ భార్యాబిడ్డలను ఎవరో సుల్తాన్ బందీచేసి ఉంచా

డుట. వారిని విడిపించుకునేటందుకు నాకు విషపు నలుగుపెట్ట నిశ్చయించావుట. నువు తెచ్చిన నలుగు నేను వాసనచూశాను. అది ఉల్లిపాషాణం వాసన!" అన్నాడు రాజు.

అబూసీర్ కళ్ళు పెద్దవిచేసి కొంతసేపు ఆశ్చర్యంగాచూసి, చివరకు, "ఈ అబూకీర్‌కు నేను చేతనైన సహాయం చేశానుగాని ఎన్నడూ అపకారం చెయ్యలేదు. అతను నాడబ్బు హరించాడు, నన్ను అకారణంగా కొట్టాడు, ఇప్పుడు నన్ను చంపించటానికే ఎత్తువేశాడు. అతను ఎంతో ఆప్తుడల్లే స్నానశాలకు వచ్చి, అన్ని ఏర్పాట్లూ మెచ్చుకుని ఉల్లిపాషాణం నలుగు లేకపోవటం ఒక్కటే లోపమని నాతో చెప్పి, వెంటనే మీ దగ్గిరికి వచ్చి నేను మిమ్మల్ని చంపబోతున్నానని ఫిర్యాదుచేశాడు! ఇటువంటి మిత్రద్రోహిని ఏమనాలి?" అన్నాడు.

"అయితే, ఇంతకూ ఆ నలుగు విషం కాదా?" అన్నాడు రాజు.

"అది అపకారం ఏమీ చేయదు. మా దేశంలో అందరూ వాడతారు. నేనే మరచిపోయాను. అతను జ్ఞాపకం చేశాక గుర్తు వచ్చింది," అన్నాడు అబూసీర్.

"నీకతను చేసిన ద్రోహాలన్నిటినీ వివరంగా చెప్పు. శిక్షిస్తాను." అన్నాడు రాజు.



అబూసీర్ తమ కథ యావత్తూ అమూలాగ్రం రాజుకు వినిపించాడు. అంతా విని రాజు, సరాయిలో ఉండే నౌకరునూ, అబూకీర్‌దగ్గిర పనిచేసే నౌకర్లనూ పిలిపించాడు. సరాయి నౌకరు అబూసీర్‌ను గుర్తించి, అతను జ్వరంతో వొళ్ళుతెలియకుండా పడి ఉన్న సమయంలో అతని స్నేహితుడు డబ్బంతా తీసుకుని పారిపోయిన వృత్తాంతం చెప్పాడు. అబూకీర్ నౌకర్లుకూడా అబూసీర్‌ను గుర్తించి, తమ యజమాని అతన్ని కొట్టిన వృత్తాంతం చెప్పారు.

అబూకీర్‌ను పెడరెక్కలు విరిచికట్టి పట్టుకురమ్మని రాజు భటులను పంపాడు.



వారు త్వరలోనే అబూకీర్‌ను పట్టితెచ్చారు. సరాయి నౌకరు అతన్ని గుర్తించి, "ఈ బాబుగారే పగలూ రాత్రీ పడుకుని నిద్ర పోయేవారు. వేళకుమాత్రం ఇంత తినే వారు. ఆఖరుకు, ఆ మానవుడు ఒళ్ళు తెలీకుండా పడివుండగా, డబ్బంతా కాజేసి ఎక్కడికో పారిపోయాడు. ఎంత గొప్ప ధర్మాత్ముడు!" అన్నాడు హేళనగా.

అబూసీర్ చెప్పినది అక్షరాలా రుజు వయింది. అబూకీర్ చేసిన మిత్ర ద్రోహం కూడా రుజువయింది.

"ఈ మిత్రద్రోహిని ఊరంతా ఊరేగించి సున్నపురాళ్ల గోతంలో కట్టి సముద్రంలో పారేయండి," అని ఉత్తరువిచ్చాడు రాజు.

అతన్ని క్షమించమని అబూసీర్, రాజును బతిమాలాడుగాని, రాజు వినలేదు.

"నీకు వాడు చేసిన ద్రోహాన్ని నువు క్షమించినా, నాకు చేసిన ద్రోహాన్ని నేను క్షమించను!" అన్నాడు రాజు.

రాజాజ్ఞప్రకారం అబూకీర్‌ను సున్నపు రాళ్ళతోసహా గోతంలో కట్టి సముద్రంలోకి తోసేశారు. అతను సున్నంలో వుడికి భయంకరమైన చావు చచ్చాడు.

తరవాత రాజు, అబూసీర్‌ను పిలిచి, ఏం కావాలో కోరుకోమన్నాడు.

"ప్రభువువారు నన్ను నా దేశానికి పంపెయ్యండి. నాకిక ఇక్కడ ఉండ బుద్ధి కావటంలేదు," అన్నాడు అబూసీర్.

రాజు అతనికి అంతులేని నగలూ, బహుమతులూ ఇచ్చి పడవలో అలెగ్జాండ్రియాకు ప్రయాణంకట్టించాడు. అబూసీర్ పడవలో పోతూండగా నీటిమీద తేలుతూ ఒక గోతం కనిపించింది. దాన్ని అబూసీర్ పడవలోకి లాగించి, విప్పి చూసేసరికి అందులో అబూకీర్ శవం వున్నది. ఆ శవాన్ని అబూసీర్ తనవెంట అలెగ్జాండ్రియాకు తీసుకుపోయి అక్కడ దాన్ని సమాధిచేయించి, దానిపై ఒక చక్కని గోరీ కట్టించాడు.





# గొర్రెల భీముడు

ఒకానొక దేశంలో గొర్రెల రాముడని ఒక కాపరి ఉండేవాడు. ఒకనాడు రాముడు పచ్చికబయలులో తన గొర్రెలను మేపుకుంటూండగా ఒక చెట్టుక్రింద పొత్తిళ్ళ గుడ్డలలో రెండు రోజుల వయసుగల పిల్లవాడు దొరికాడు. పిల్లలులేని రాముడు ఆ కుర్రవాణ్ణి తీసుకుని, వాడికి ఒక గొర్రెదగ్గిర పాలుపట్టి, ఇంటికి తీసుకుపోయాడు.

ఆదిమొదలు ఆ గొర్రె వాడికి తల్లి అయింది. దాని పాలుతాగి ఆ చంటివాడు బాగా పుష్టి సంపాదించసాగాడు. వాడు రోజురోజుకూ పెరిగే పద్ధతిచూసి వాడికి భీముడని పేరు పెట్టుకున్నారు. భీముడు ఏడేళ్ళకే ఒకమాదిరి చెట్లను సునాయాసంగా పీకి పారేసే బలం సంపాదించాడు.

తాను పెంచిన అనాధ శిశువు ఏవో విధంగా ప్రయోజకుడయినందుకు గొర్రెల రాముడు చాలా ఆనందించాడు.

భీముడికి పధ్నాలుగేళ్లు నిండగానే, వాడితండ్రి, "నాయనా, నీపేరు అప్పుడే పన్నెండామడ పాకింది. నీకు గొర్రెలను కాసే కర్మ ఏమిటి? దేశదేశాలూ తిరిగి, కీర్తీ ధనమూ సంపాదించి గొప్పవాడివి అవుదువుగాని. బయలుదేరు!" అన్నాడు.

ఆ ప్రకారమే భీముడు బయలుదేరాడు. వాడు అనేక పట్టణాలు చూశాడు. అక్కడి బలశాలులను ఓడించాడు. "గొర్రెల భీముడు" అంటే అందరికి తెలిసిపోయింది.

కొంతకాలం గడిచింది. భీముడు ఒక నగరం సమీపంలో ఉన్న అడవిలోనుంచి

కె. శ్రీనివాసరావు



పోతూండగా, వాడికొక మనిషి కనిపించాడు. ఈ మనిషి పెద్దపెద్ద చెట్లను పట్టుకుని చీల్చి, నారతీస్తున్నాడు. భీముడు వాణ్ణి సమీపించి, "అన్నా, ఏమిటిది? చెట్లనెందు కిట్లా చీల్చేస్తున్నావు?" అని ఆశ్చర్యపడుతూ అడిగాడు.

"గొర్రెల భీముడు వస్తాట్ట. వాణ్ణి గెలవటానికి తయారు తింటున్నాను," అన్నాడు చెట్లు చీల్చేవాడు.

"నేనే గొర్రెల భీముణ్ణి. కావలిస్తే గెలు!" అన్నాడు భీముడు.

ఇద్దరూ ముష్టియుద్ధం ఆరంభించారు. ఇద్దరూ మంచి బలశాలులే. చెట్లు చీల్చే వాణ్ణి నడుముపట్టి భీముడు కిందపడగొట్ట యత్నించాడు. చెట్లు చీల్చేవాడు పట్టు తప్పించుకుని దూరంగా వెళ్ళి భీముడి మీదికి ఉరుకుతూవచ్చి అతని గుండెల్లో రెండు కాళ్ళూ ఎత్తి బలంగా తన్నబోయాడు. భీముడు వాడి కాళ్లు పట్టుకుని గిరగిరా తిప్పి విసిరివేశాడు. వాళ్ళ భయంకర పోరాటానికి భూమి దద్దరిల్లింది. చెట్ల మీదినుంచి పక్షులు కేకలు పెడుతూ ఆకాశంలోకి ఎగిరిపోయాయి.

ఆఖరుకు భీముడు చెట్లు చీల్చే వాణ్ణి రెండుచేతులా పట్టి ఎత్తి నిలువునా భూమి మీదికి బంతిని కొట్టినట్టు విసిరికొట్టాడు.

దెబ్బకు వాడు మోకాళ్ళదాకా భూమిలోకి ఇరుక్కుపోయాడు. కాని వెంటనే వాడు పైకివచ్చి ఎట్లాగో భీముణ్ణి పట్టుకుని యెత్తి తన బలంకొద్దీ భూమికేసి కొట్టాడు. ఆ దెబ్బకు భీముడు మొలలోతున భూమిలో దిగబడిపోయాడు. అతనికి కోపంవచ్చి, పైకివస్తూనే చెట్లు చీల్చేవాణ్ణి బాగా పైకెత్తి తనకున్న శక్తిఅంతా వుపయోగించి, వాణ్ణి భూమిలోకి మేకు దిగవేసినట్టు మెడ లోతున దిగవేశాడు. భూమిలోనుంచి వాడు పైకి రాలేకపోయాడు.

చెట్లు చీల్చేవాడి ప్రాణాలిప్పుడు భీముడి చేతుల్లో ఉన్నాయి.

"చాలు, చాలు! నువ్వే గెలిచావు! నన్ను పైకిలాగు. ఇకనుంచీ నేను నీ శిష్యుడుగా వెంట తిరుగుతాను!" అన్నాడు చెట్లు చీల్చేవాడు, దణ్ణంపెడుతూ. భీముడు వాణ్ణి పైకిలాగి శిష్యుడుగా తనవెంట తీసుకుని బయలుదేరాడు.

ఇద్దరూ కలిసి కొంతకాలం తిరిగి ఒక కొండప్రాంతం చేరారు. అక్కడ వాళ్ళకొక వింతమనిషి కనిపించాడు. ఈ మనిషి పెద్ద పెద్ద బండరాళ్ళను ఎత్తి రెండు చేతుల మధ్యా నొక్కి పిండిచేసేస్తున్నాడు.

'ఎందుకిట్లా రాళ్ళు పిండిచేస్తున్నావు?" అని అడిగాడు భీముడు.







"గొర్రెల భీముడు వస్తాట్ట. వాణ్ణి ఓడించటానికి తయారు తింటున్నాను," అన్నాడు రాళ్ళు పిండిచేసేవాడు. "నేనే గొర్రెల భీముణ్ణి! కావలిస్తే ఓడించు," అన్నాడు భీముడు.

ఇద్దరూ కలియబడ్డారు. చెట్లు చీల్చే వాడి గతే రాళ్ళు పిండిచేసేవాడికి పట్టింది. వాడుకూడా మెతలోతున భూమిలో ఇరుక్కు పోయి పైకి రాలేకపోయాడు. అందుచేత వాడుకూడా భీముడికి శిష్యుడై, అతనివెంట బయలుదేరాడు.

ముగ్గురూ కలిసి చాలాకాలం ప్రయాణించగా ఒక ఊళ్ళో వారికొక వింత మనిషి కనిపించాడు. ఈ మనిషి ఇనుప ముద్దలు తీసుకుని, అప్పడాలపిండి పిసికి నట్టు పిసుకుతున్నాడు. "ఎందు కిట్లా యినుము పిసుకుతున్నావు?" అని భీముడు వాణ్ణి అడిగాడు.

"గొర్రెల భీముడు వస్తాట్ట. వాణ్ణి జయించటానికి తయారు తింటున్నాను," అన్నాడు ఇనుము పిసికేవాడు.

"నేనే గొర్రెల భీముణ్ణి! కావలిస్తే జయించు!" అన్నాడు భీముడు.

ఇద్దరూ కలియబడ్డారు. ఇనుము పిసికే వాడుకూడా మిగిలినవాళ్ళలాగే ఓడిపోయి, భీముడికి శిష్యుడై, వెంట బయలుదేరాడు.

నలుగురూ కలిసి ప్రయాణంచేస్తూ ఒక మహారణ్యం ప్రవేశించారు. మొదటిరోజు మధ్యాన్నం భీముడు, వంట చెయ్యమని చెట్లు చీల్చేవాణ్ణి నియమించి, మిగిలిన వాళ్ళతోసహా వేటకు బయలుదేరాడు.

చెట్లు చీల్చేవాడు వంట చేస్తూండగా ఒక మరుగుజ్జువాడు వచ్చి, "అన్నా, ఆకలిగావుంది. భోజనం పెడతావా?" అని అడిగాడు.

"భోజనంలేదు, బొగ్గులేదు! పద పద!" అని అదిలించాడు, చెట్లు చీల్చేవాడు. మరుగుజ్జువాడు కొంచెందూరంగా వెళ్ళి





కూచుని, వంటఆయే సమయానికి వెనక నుంచి వచ్చి, చెట్లు చీల్చేవాణ్ణి వెల్లకిలా పడేసి, వాడి గుండెలమీద ఎక్కికూచుని, వంటంతా తినేసి, తాపీగా లేచి వెళ్ళిపోయాడు.

మూరెడు లేని మనిషి ఇంతపని చేశాడంటే చెట్లు చీల్చేవాడికి చచ్చే సిగ్గయింది. వేటకు వెళ్ళినవాళ్ళకు ఈ సంగతి చెప్పటం ఇష్టంలేక మళ్ళీ వెంటనే వాడు కొత్తవంట ఆరంభించాడు. అయితే వంట పూర్తిఆయే లోగా మిగిలినవాళ్ళు తిరిగివచ్చేశారు. ఎంతో సేపటినుంచి చేస్తున్నా చెట్లుచీల్చేవాడి వంట పూర్తికాకపోవటం చూసి, "నీకు వంటపని ఏమీ చేతకాదు," అన్నాడు గొర్రెల భీముడు.



మర్నాటి మజిలీలో వంటపనికి రాళ్ళు పిండిచేసేవాణ్ణి నియోగించి మిగిలినవారితో భీముడు వేటకు వెళ్ళాడు. ఆరోజుకూడా మరుగుజ్జు వచ్చాడు. చెట్లు చీల్చేవాడికి జరిగిన పరాభవమే రాళ్ళు పిండి చేసేవాడికీ అయింది. భీముడూ మొదలైనవాళ్ళు తిరిగి వచ్చేసరికి రెండో వంట ఇంకా అవుతూనే వుంది. దానికి కారణం రాళ్ళు పిండిచేసే వాడు బయట పెట్టలేదు.

మూడోరోజు మజిలీలో ఇనుము పిసికే వాడు వంటకుగాను ఉంచబడ్డాడు. మిగిలినవాళ్ళు వేటకుపోయిన సమయంలో మరుగుజ్జు రానేవచ్చాడు. ఇనుము పిసికే వాణ్ణి పడదోసి, వాడి గుండెలమీద యెక్కి కూచుని వంటయావత్తూ తినేసి వెళ్ళిపోయాడు. ఇంకా వంట ఎందుకు కాలేదో చెట్లు చీల్చేవాడూ, రాళ్ళు పిండిచేసేవాడూ గ్రహించ గలిగారు.

భీముడు తిరిగివచ్చి ఇంకా వంట కాకపోవటం చూసి ఆశ్చర్యపడిపోయాడు. ఇందులో ఏదో రహస్యమున్నదనీ, తన శిష్యులు దానిని బయటపెట్టటానికి సిగ్గుపడుతున్నారనీ గ్రహించి, నాలుగో రోజు మజిలీలో తానే వంటకు వుండిపోయి మిగి





లినవాళ్ళను వేటకు పంపాడు. మామూలుగానే వంటఅయే సమయానికి మరుగుజ్జు వచ్చాడు. భోజనం పెట్టమని అడిగాడు. భీముడు వంట గిన్నెలు ఎత్తుగాయెత్తి పట్టుకుని, "పద పద!" అన్నాడు. మరుగుజ్జు వెళ్ళిపోక, ఎగిరి భీముడి గొంతు పట్టుకోజూచాడు. భీముడు వాణ్ణి పట్టుకుని దూరాన ఒక లావుపాటి చెట్టుకు కట్టేసి తిరిగి వచ్చాడు.

ఈసారి గురువుగారికే పరాభవం అవుతుందనుకుంటూ వేటనుంచి తిరిగివచ్చిన శిష్యులు, వంట సిద్ధంగా వుండటం చూసి ఎంతో ఆశ్చర్యపడ్డారు.

"మోకాలంత లేనివాడికి లొంగిపోయిన మీ తెలివి తగలబడ్డట్టే ఉంది. భోజనం చెయ్యండి. వాణ్ణి ఏంచేశానో చూపిస్తా!" అన్నాడు భీముడు.

భోజనాలుచేశాక నలుగురూ పొట్టివాణ్ణి కట్టివేసిన చెట్టువద్దకు వెళ్ళారు. కాని అక్కడ చెట్టులేదు. అది వుండవలసిన చోట గొయ్యిమాత్రం వుంది. చెట్టును పెకలించి ఈడ్చుకుంటూ పొట్టివాడు వెళ్ళిపోయిన జాడలు అడవిలో కనిపిస్తున్నాయి. నలుగురూ ఆ జాడనుబట్టి బయలుదేరి అడవివెంబడి చాలా దూరం వెళ్ళారు. ఈ జాడలు ఆకస్మాత్తుగా ఒక పెద్ద





గుంటవద్ద ఆగిపోయాయి. ఆ గుంటలోకి తొంగిచూస్తే దాని అడుగు కనబడలేదు.

"ఒక తట్టలో కూచుంటాను. నన్ను తాళ్ళతో దించండి. ఆ పొట్టివాడి అంతు తేల్చినాక మళ్లీ పైకి లాగుదురుగాని," అన్నాడు భీముడు.

ఎంతో లోతున తట్ట నేల తగిలింది. అక్కడ అందమైన ఉద్యానవనాలూ, భవనాలూ వున్నాయి. ఉద్యానవనంలో విహరిస్తూ భీముడికి ఒక అందమైన అమ్మాయి కనబడింది. ఆమె భీముణ్ణి చూడగానే కంగారుపడి, "ఇక్కడికెందుకు వచ్చావు? ఇది నాగలోకం. పన్నెండు తలల నాగేంద్రుడు నిన్ను చూస్తే బతకనివ్వడు. ఇక్కడినుంచి వెంటనె వెళ్ళిపో!" అన్నది.

"నన్ను చూడటానికి నాగేంద్రుడు భయపడాలి: నాగేంద్రుడి భయం నాకేమిటి? ఇంతకూ నువ్వెవరవు?" అన్నాడు భీముడు.

"నేను ఒక రాజకన్యను. నన్నూ, నా అక్కలు ముగ్గుర్నీ ఈ నాగరాజు పట్టి తెచ్చి ఇక్కడ వుంచాడు. వచ్చే నాగుల చవితినాడు, కుబుసం విడిచి మమ్మల్ని పెళ్ళాడతాడు," అన్నదాపిల్ల.

వాళ్లావిధంగా మాట్లాడుకుంటూండగానే పన్నెండుతలల నాగేంద్రుడక్కడికి వచ్చాడు. భీముణ్ణి చూడగానే బుసలు

కొడుతూ, "మదాంధుడా, నాకు స్థాన బలంవున్న చోటికే వచ్చావా? ఇప్పుడెట్లా తప్పించుకుంటావు?" అంటూ భీముడి మీదికి దూకాడు. నాగేంద్రుడి శరీరం అప్పుడే భీముణ్ణి చుట్టనారంభించింది.

నాగేంద్రుడు తనను నలిపివెయ్యకుండా వుండగలందులకు భీముడు తన శరీరాన్ని ఉక్కులాగా చేసేశాడు. ఇదిచూసి నాగేంద్రుడు కాటువెయ్యటానికి తన పన్నెండు తలల పడగను బుసలుకొడుతూ భీముడి మీదికి చాచాడు. భీముడు తన రెండు చేతులతో పడగను గట్టిగా పట్టేశాడు. నాగేంద్రుడు భీముడి చేతులను వదిలించుకోవాలని తన శరీరాన్ని అతని భుజాల మీదిగా చుట్టాడు. కాని లాభంలేకపోయింది. భీముడు పట్టువిడవక నాగేంద్రుడి పడగను బలంకొద్దీ నేలకువేసి కొట్టాడు. క్రమంగా నాగేంద్రుడి శరీరంలోని బలం తగ్గిపోయింది.

చివరకు పన్నెండుతలల నాగేంద్రుడు ప్రాణం సొమ్మసిల్లి నేలమీద పడిపోయి, "నన్నుకూడా నీ శిష్యుణ్ణిగా చేర్చుకో!" అని భీముడితో మొరపెట్టుకున్నాడు.

"నువు బలంగలవాడివైతే నీ ప్రతాపం నీ లోకంలో వెలగబెట్టు. మా లోకంలోకి వస్తివా నిలువునా, చీల్చేస్తాను, జాగ్రత్త!" అన్నాడు భీముడు.

ఆ తరవాత భీముడు నలుగురు రాజకుమార్తెలతోసహా తట్టలో కూచుని తాళ్ళు ఆడించాడు. భీముడి శిష్యులు తట్టను తిరిగి భూమిపైకి లాగారు.

భీముడూ, అతని శిష్యులూకూడా ఆ నలుగురు రాజకుమార్తెలనూ పెళ్ళాడి మామగారి ఇంటనే ఉండిపోయారు. మళ్లీ ఎన్నడూ పన్నెండుతలల నాగేంద్రుడు భూమిమీదికి అడుగుపెట్టి ఎరగడు. గొర్రెల భీముడింకా యీ భూమిమీద వున్నాడనే నాగేంద్రుడి భయం!





# రాజదర్శనం

కరిపురానికి రాజు బలవర్ధనుడు. ఆయన భార్య ఒక ఆడపిల్లను కని మరణించింది. రాజు మరొకభార్యను వివాహమాడాడుగాని ఆమెకు సంతానం కలగలేదు. రాజు తన కుమార్తెకు హేమ అని పేరుపెట్టుకుని ఎంతో గారాబంగా పెంచాడు. తన అనంతరం ఆమే సింహాసనం ఎక్కుతుందిగనక ఆమెకు రాజు సమస్తవిద్యలూ నేర్పించాడు.

హేమ బాగా చదువుకున్నది కావటమే గాక ఎంతో అందగత్తెకూడానూ. ఆమెను చూసి సంతోషించని మనిషి ఆమె మారుతల్లి ఒక్కతే. ఆవిడకు హేమనుచూస్తే సహించరాని అసూయ. అందుచేతనే రాజు హేమకు ఎన్ని సంబంధాలు చూసినా ఆవిడ, "ఇంకా మంచి సంబంధం వస్తుంది!" అంటూ అడ్డుపుల్లవేస్తూ వచ్చింది.

ఇలా ఉండగా ఒకనాడు బలవర్ధనరాజు వేటకు బయలుదేరి వెళ్ళాడు. మారుతల్లి హేమను ఒకసారి రమ్మని కబురుమీద కబురు పంపింది. హేమ వెళ్ళటానికి మొదట పస్తాయించి చివరకు, బాగుండదని సాయంకాలంవేళ తన మారుతల్లిని చూడటానికి వెళ్ళింది.

మారుతల్లి, హేమమీద ఎంతో అపేక్షగల దానిలాగా నటిస్తూ తినటానికి అవీ ఇవీ తెచ్చిపెట్టింది. హేమ తనకు ఆకలిగా లేదని అబద్ధమాడి తినుబండారాలన్నిటినీ మూటగట్టుకుని, తరవాత తింటాలెమ్మన్నది. ఆ తరవాత మారుతల్లి, హేమకు గంధం పూయించింది, పూలుపెట్టించింది. అగరు వాసన చూడమని హేమ ముక్కుదగ్గిర ఏదో పెట్టింది. అది వాసనచూస్తూనే హేమ ఒళ్ళుతెలియకుండా పడిపోయింది.

రాజుభార్య మైకంలో ఉన్న హేమను ఒక కొయ్యపెట్టెలో పడుకోబెట్టి, అర్ధరాత్రి వేళ తన నౌకర్లను పిలిపించి, వారిచేత

సి. హెచ్. వెంకోబారావు



ఆ పెట్టెను కోటగోడమీదుగా శ్మశానంలో పడేటట్టు పారవేయించింది.

అరాత్రే ఆ శ్మశానం ప్రాంతాలకు విజయుడనే యువకుడు గుర్రంమీద దూర దేశంనుంచి వచ్చిచేరాడు. చీకటిలో అతనికి ఒక పాకా కనబడింది. అందులో తెల్లవారినదాకా విశ్రమింతామని అతను పాకా సమీపానికి వచ్చేసరికి దాని అవతల రెండు మూడు చితులు కాలుతూ కనపడ్డాయి. అవి చూడగానే శ్మశానమని తెలిసిపోయింది. ఆ పాకా కర్మచేసేవారి కోసం వేసినది.

విజయుడు గుర్రాన్ని వెలపల కట్టేసి పాకలోకి వెళ్ళాడు. కాని అతనికి నిద్రపట్టలేదు. ఇంతలో దూరాన దభేలుమని ఏదో పడిన చప్పుడు వినిపించింది. వెంటనే విజయుడు చితిలో కాలే కాష్ఠం ఒకటి చేతబట్టుకుని చప్పుడు వినిపించిన చోటికి వెళ్ళాడు. కాష్ఠం వెలుగులో అతనికి కోట గోడా, దానిపక్కనే ఒకపెట్టే కనిపించాయి. అతను పెట్టెమూత తీసి చూసేసరికి అందులో ఒక అపూర్వమైన అందగత్తె స్పృహలేని స్థితిలో కనబడింది.

విజయుడామెను తన చేతులలోకి ఎత్తుకుని పాకలోకి చేర్చి, ఆమెకు స్పృహ తెప్పించటానికి ఎన్నో యత్నాలు చేశాడు. కాని లాభం లేకపోయింది. గిట్టనివారెవరో ఆమెకు ద్రోహం చేసివుంటారని అతను గ్రహించాడు. తెల్లవారబోతున్నది. జన సంచారం ఆరంభమయితే ప్రమాదం. అందుచేత విజయుడు, హేమను గుర్రం మీద ఎక్కించుకుని ఒక గ్రామంచేరి ఒక బ్రాహ్మడి ఇంటికి వెళ్ళి "అయ్యా మేము చాలా దూరంనుంచి వస్తున్నాము. నా భార్యకు చాలా జబ్బుగా ఉంది. రెండు రోజులు మీ ఇంట వుండనిస్తారా? చికిత్స చేయించుకుంటాను!" అని అడిగాడు.

గృహస్థు సరేనని ఒక మూలగది చూపించాడు. పగలల్లా విజయుడు ఉపచారాలు

చేయగా, చేయగా సాయంకాలానికి హేమకు స్పృహతెలిసింది. ఆమె విజయుణ్ణి చూసి ఆశ్చర్యపోయింది. అతను తనకు తెలిసిన దంతా ఆమెకు చెప్పాడు. తరువాత ఆమె అతనితో తన చరిత్రయావత్తూ చెప్పింది. తాను అతని భార్య అయినట్టు విజయుడు గృహస్థుతో తప్పనిసరి అయి చెప్పినప్పటికీ, హేమ తనప్రాణాలు కాపాడిన విజయుణ్ణి మనసులో భర్తగా స్వీకరించింది.

కొద్దిరోజులలోనే హేమ ఆరోగ్యం కుదట పడింది. కాని ఆమెకూ విజయుడికీ కొత్త బెడద ఒకటివచ్చిపడింది. వేటనుంచి తిరిగి వచ్చిన బలవర్ధనుడు హేమ ఏమయిందని అడిగితే, అయనభార్య, "ఎవరి వెంటనో వెళ్ళిపోయింది," అని చెప్పేసింది. రాజుకు ఆగ్రహంవచ్చి తన కుమార్తెను వెదకటానికి అన్నివైపులా భటులను పంపాడు. ఈ విషయం నలుగురూ చెప్పుకుంటూండగా విజయుడువిని ఇంటికివచ్చి హేమతో సంగ తంతా చెప్పేశాడు. ఇద్దరూ చర్చించుకుని ఆరాత్రి ప్రయాణమై వెళ్ళిపోవటానికి నిశ్చ యించుకున్నారు. ఎందుచేతనంటే, హేమ నిజం చెప్పినా రాజు నమ్మడు. అపాయం హేమకు మాత్రమేగాక, ఆమెను రక్షించిన విజయుడికికూడా చుట్టుకుంటుంది.




విజయుడూ హేమా రహస్యంగా జరిపిన చర్చను ఇంటి యజమాని అయిన బాహ్మడు మాత్రం విన్నాడు హేమ రాజకుమార్తె అనీ, ఆమెను మారుతల్లి చంపటానికి యత్నించిం దనీ ఆయనకు తెలిసిపోయింది.

అనుకున్నప్రకారం ఆరాత్రే విజయుడూ హేమా గుర్రంమీద ప్రయాణమై వెళ్ళి పోయారు. వారావిధంగా చాలా రోజులు ప్రయాణంచేసి జయపురమనే నగరంచేరి, సత్రంలో బసచేశారు. ఆరాత్రి హేమకు నిద్రపట్టలేదు. ఎన్నడూ కష్టమన్నది ఎరగ కుండా రాజభోగాలు అనుభవించిన తాను అన్నిసుఖాలకూ దూరమై ఎక్కడో దేశం

కాని దేశంలో సత్రంలో తలదాచుకోవలిసి వచ్చినందు కామె దుఃఖించసాగింది.

విజయుడు ఆమెను ఓదార్చుతూ "విచారించకు, హేమా! ఒక్కసారి ఈఊరి రాజు దర్శనం నాకు లభించిందంటే, నిన్ను ఏడంతస్తుల మేడలో బంగారు తూగుటుయ్యాలలో ఊగించనా?" అన్నాడు.

ఈ మాటలు జయపురం రాజయిన భీమవర్మ చెవిని పడ్డాయి!

అది ఎలా జరిగిందంటే, భీమవర్మ నెలకొక రాత్రి మారువేషంలో నగరమంతా తిరిగి ప్రజలేమనుకుంటున్నారో వినేవాడు. ఈరాత్రి ఆయన మారువేషంలో సత్రం సమీపానికి వచ్చేసరికి విజయుడి మాటలు ఆయన చెవినిపడ్డాయి. ఈ యువకుడు తన దర్శనం లభించినంత మాత్రం చేతనే తన భార్యను ఏడంతస్తుల మేడలో ఎట్లాఉంచుతాడో చూడాలని ఆయనకు ఆసక్తి కలిగింది. ఆయన మర్నాడు సభకు వస్తూనే తన మంత్రిని పిలిచి, "సత్రంలో ఒక యువకుడు భార్యాసమేతుడై వచ్చి బస చేస్తున్నాడు. అతని భార్యపేరు హేమ. వెంటనే భటులను పంపి అతన్ని సభకు ఆహ్వానించండి," అన్నాడు.

రాజభటులు సత్రానికివెళ్ళి సగౌరవంగా విజయుణ్ణి సభకు తీసుకువచ్చారు. భీమ



వర్మ అతన్ని చూసి తన సింహాసన పక్కనే ఆసనం చూపి కూచోమని సంజ్ఞచేశాడు. అంతకన్న ఆయన విజయుడితో మరే సంగతీ మాట్లాడలేదు.

మధ్యాన్నానికి రాజు సభ చాలించాడు. రాజుతోబాటు అందరూ లేచారు. ఎక్కువ మంది రాజుగారివద్ద సెలవుతీసుకుని వెళ్ళిపోయారు. మిగిలినవారు తమతమ హెూదాలనుబట్టి మొదటి అంతస్తుదాకా, రెండో అంతస్తుదాకా, మూడో అంతస్తుదాకా రాజుగారిని సాగనంపి సెలవు పుచ్చుకుని కిందికి దిగిపోయారు. మంత్రీ, సామంతులూ సయితం నాలుగో అంతస్తువద్ద రాజుగారి వద్ద సెలవు పుచ్చుకున్నారు. ఒక్క విజయుడుమాత్రం ఆరో అంతస్తుదాకా రాజుగారివెంట వెళ్ళి అక్కడ సెలవుపుచ్చుకుని గబగబా మెట్లు దిగివచ్చి మిగిలినవారిని "మంత్రి ఎవరు?" అని అడిగాడు.

"చిత్తం నేనేనండి!" అన్నాడు మంత్రి.

మంత్రి ఇంత వినయంగా ప్రవర్తించటానికి చాలా కారణాలున్నాయి. ఈ యువకుడు రాజదర్శనంకోసం విజ్ఞాపన చేసుకోకుండానే రాజు ఇతనిని సభకు ఆహ్వానించాడు. అతను వచ్చాక రాజు సింహాసనం పక్కనే చోటు చూపించాడు. సభ చాలించినాక రాజు పైకివెళ్ళిపోయేటప్పుడు, అందరూ





వెనక్కు తగ్గినాకూడా ఈ కుర్రవాడు రాజు వెంట వెళ్ళాడు. రాజుకూ ఇతనికీ మధ్య ఇతరులు వింటూండగా ఎట్టి సంభాషణా జరగలేదు. ఏమైనా జరిగితే ఏకాంతంగానే జరిగి ఉండాలి. వీటన్నిటినీబట్టి ఇతను రాజుకెంత ఆప్తుడో అని మంత్రి భయపడ్డాడు.

"ఓహో, మంత్రి తమరేనా? అయితే నాకు వెంటనే వెయ్యిమంది కూలీలనూ, పలుగులనూ ఇప్పించండి. వందగజాల గొలుసుతో మూడువందలమంది రక్షకభటులను ఇప్పించండి!" అన్నాడు విజయుడు.

రాజుగారి ఆజ్ఞ అయింది కాబోలుననుకుని మంత్రి తక్షణమే విజయుడు కోరిన ఏర్పాట్లన్నీ చేశాడు. విజయుడు కూలీలనూ, రక్షక భటులనూ, పలుగులనూ, గొలుసులనూ వెంటబెట్టుకుని వీధుల వెంబడి బయలుదేరాడు. కొత్త మేడలూ, పెద్దపెద్ద భవంతులూ కనిపించినచోటనల్లా ఆగి అతను ఆ మేడలుగలవాళ్ళతో, "వీధులు పెద్దవిచేస్తున్నాం. ఈ ఇల్లెవరిది?" అని అడగసాగాడు.

మొట్టమొదటి ఇంటివద్ద ఇల్లుగలమనిషి "చిత్తం ఈ ఇల్లు నాదేనండి!" అన్నాడు.

"మీరు వెంటనే ఇల్లు ఖాళీచెయ్యండి. ఈ ఇల్లు పడగొట్టాలి. చూస్తారేంరా? పలుగులు!" అన్నాడు విజయుడు.

ఇంటి యజమాని హడలిపోయి, "అయ్యా, కొంచెం నిదానించండి. ఒక్క క్షణం లోపలికి దయచేయాలి!" అంటూ విజయుణ్ణి లోపలికి తీసుకుపోయాడు. సంచులలో ధనం తెచ్చి విజయుడిముందు పెట్టి, "కటాక్షించాలి! కొత్తయిల్లు! మండిగం పసుపన్నా చెరగలేదు!" అన్నాడు.

"సరే," నంటూ విజయుడు సంచులు పట్టుకుని మరొకచోటికి వెళ్ళాడు. ఈవిధంగా అతను సాయంకాలందాకా నగరమంతా తిరిగి అంతులేని సొమ్ము సంపాదించాడు. చీకటిపడ్డాక అతను తనవెంట వచ్చిన

వారందరికీ బహుమతులిచ్చి, "ఇక మీరు వెళ్ళండి. పనిపడితే మళ్లీ మంత్రిద్వారా కబురుచేస్తాలే!" అని వారిని పంపేశాడు.

మర్నాడే విజయుడు తాను సంపాదించిన ధనరాసులతో నగరంమధ్యను ఒక ఏడంతస్తుల మేడ కొనేసి, అందులో దేదీప్యమానంగా దీపాలూ, ఖరీదైన సామానూ, బంగారు తూగుటుయ్యాలా ఏర్పాటుచేసి అందులో హేమకు తగిన రాణివాసం కట్టించి, ఆనాటినుంచీ సుఖంగా ఆమెతో కాపరం చెయ్యసాగాడు.

నెల తిరిగి వచ్చింది. మళ్ళీ ఒకరాత్రి భీమవర్మ మారువేషం వేసుకుని నగరపర్యటన ఆరంభించాడు. ఆయన నగరమధ్యానికి వచ్చేసరికి, రాజసౌధాన్ని తలదన్నే ఏడంతస్తుల భవంతి దేదీప్యమానంగా వెలిగిపోతూ కనిపించింది. అక్కడ అలా వెలిగిపోయే భవంతి ఉండటం ఆయన ఎన్నడూ గమనించలేదు. ఆ యింటినిగురించి రాజు ఆరాతీయించాడు. నెలక్రితం తాను కొలువుకు పిలిపించిన యువకుడే ఆ మేడకు యజమాని అని తెలిసింది. రాజు ఆశ్చర్యానికి అంతులేదు.

"వీడెవడో ఉద్దండుడులాగున్నాడు! అన్నంతపనీ చేశాడే!" అనుకుని భీమవర్మ



విజయుణ్ణి పిలిపించి జరిగినదంతా తెలుసుకున్నాడు. తనమంత్రి వట్టి బుద్ధిహీనుడనీ, అంతకంటే విజయుడే ఎంతో సమర్థుడనీ తోచి రాజు విజయుణ్ణి ఆనాటినుంచే తన మంత్రిగా నియమించుకున్నాడు.

కొంతకాలం గడిచింది. హేమ గర్భవతిగా ఉండి కాలక్రమాన మగశిశువును కన్నది. మంత్రిగారికి కుమారుడు కలిగాడని ఊరంతా ఉత్సవాలు చేశారు. కాని హేమకుమాత్రం ఏమాత్రమూ ఆనందం కలగలేదు. తన తండ్రి రాజ్యానికి రాజు కావలిసిన తన భర్త ఇంకొక రాజుకింద మంత్రిగా ఉండటమూ, యువరాజు అని

పెంచుకోవలసిన తన కుమారుణ్ణి అందరూ మంత్రికుమారుడనటమూ ఆమెను బాధించింది. ఆమె మనసు ఎన్నోసార్లు స్వదేశం మీదికీ, తండ్రిమీదికీ పోయింది.

కాని హేమకు స్వదేశం వెళ్ళే అర్హత లేదు. ఆమె కనిపిస్తే బలవర్ధన మహారాజు తల తీయించేస్తాడు. మారుతల్లి హేమను చంపటానికి యత్నించిందని ఇంతకాలమయాక రుజువు చేయుటం అసంభవం. మీదుమిక్కిలి, హేమ ఎవరితోనో వెళ్ళిపోయిందని మారుతల్లి చేసిన ఆరోపణకు ప్రత్యక్షసాక్ష్యంగా విజయుడూ అతనికి పుట్టిన కుమారుడూ ఉన్నారు. అందుచేత హేమ తన కోరికను అణుచుకున్నది.

కాని నిజం దాగలేదు. మొదట హేమకు ఆశ్రయం ఇచ్చిన బ్రాహ్మడు రాజుగారి వద్దకు వెళ్లి నిజం చెప్పేశాడు. తాను వేటకు పోయిఉన్న సమయంలో హేమను తన భార్య చంప యత్నించిందనీ, ఆమె నెవరో యువకుడు రక్షించాడనీ, తరవాత ప్రాణరక్షణార్థం తనకుమార్తె ఎటో వెళ్లిపోయిందనీ తెలిసి బలవర్ధన మహారాజు చాలా చింతించాడు. అయన తన భార్యను చెరసాలలో పెట్టించి కుమార్తెకోసరం దేశాల మీద మనుషులను పంపాడు. వీరిలో కొందరు జయపురం వచ్చారు. వారు అక్కడి సత్రంలో బసచేసి, చెప్పిన యీ విచిత్రకథ విజయుడిదాకా వెళ్లింది. వెంటనే అతను హేమతో ఆ విషయం చేప్పేశాడు.

తనకొరకు తండ్రి వెతికిస్తున్నాడని తెలియగానే హేమకు ఎక్కడలేని ఆనందమూ వచ్చింది. తరవాత విజయుడు, భీమవర్మతో జరిగిన సంగతులన్నీ చెప్పి, ఆయనవద్ద సెలవు పుచ్చుకుని భార్యతో కుమారుడితో కలిసి కరిపురం వెళ్లాడు. బలవర్ధనుడి ఆనందానికి మేరలేదు. ఆయన తన సింహాసనాన్ని విజయుడికిచ్చి మనవడిని యువరాజుగా ప్రకటించాడు.



# మాయమైన మాంసం

ఒకనాడు గోహా బజారుకు వెళ్లి కట్టెడు మాంసం కొన్నాడు. దానిని తెచ్చి తన భార్యకిచ్చి, "నేను పనిమీద వెళుతున్నాను. సరిగా భోజనంవేళకు తిరిగి వస్తాను. ఈలోపల ఉల్లిపాయల మసాలాతో కబాబ్‌లు చేసి ఉంచు," అన్నాడు.

గోహా చెప్పినట్టే అతని భార్య మాంసంతో కబాబ్‌లు తయారుచేసింది. ఇంకా భోజనాలవేళకు చాలా వ్యవధి ఉంది. అందుచేత కబాబ్‌లు రుచిచూడటానికి తన తమ్ముణ్ణి ఒకసారి వచ్చిపొమ్మని ఆమె కబురుచేసింది. అతను వచ్చాక ఇద్దరూ కలిసి కబాబ్‌లన్నీ ఖాళీచేసేశారు.

భోజనంవేళకు గోహా ఇంటికి వచ్చి భోజనానికి కూచున్నాడు. కబాబ్‌లు కంచంలోకి రాకపోవటం చూసి అతను భార్యను, "కబాబ్‌లు చేయమంటిని గదా, చెయ్యలేదేం?" అని అడిగాడు.

"చేద్దామనే అనుకున్నాను. కాని ఈలోపల మన పిల్లి మాంసమంతా తన పొట్టనపెట్టుకుంది. నేనేం చేసేది?" అన్నది గోహాభార్య.

వెంటనే గోహా కంచంముందునుంచి లేచి త్రాసు తెచ్చి పిల్లిని అందులో తూచాడు. పిల్లి సరిగా కట్టెడే తూగింది.

"దిక్కుమాలినదానా? ఇది మాంసమైతే, పిల్లి ఏదీ?" అని భార్యనడిగాడు గోహా.






# కాళిదాసుతో పోటీ

అవంతిదేశంలో హేమచంద్రుడనే ఒక కవి ఉండేవాడు. అతను చాలా ధనికుడు. అతను కాళిదాసు పేరు ప్రతిష్టలూ, భోజ రాజు ఆస్థానంలో కాళిదాసుకు గల అగ్ర స్థానం మొదలైన విషయాలు విన్నాడు. కాళిదాసును కవిత్వంలో ఓడించి, అతని స్థానం కాజెయ్యాలనే దుర్బుద్ధి హేమచం ద్రుడికి కలిగింది.

ఈ ప్రయత్నంమీద హేమచంద్రుడు తన పల్లకీ ఎక్కి, కొంత పరివారాన్ని వెంట బెట్టుకుని ధారానగరం చేరి ఒక సత్రంలో బసచేశాడు. తనను ఓడించి తన స్థానం ఆక్రమించే ఉద్దేశంతో హేమచంద్రుడు వచ్చినట్టు కాళిదాసుకు తెలిసింది.

అతను ఈ హేమచంద్రుడి శక్తి ఏపాటిదో చూద్దామనే ఉద్దేశంతో బోయీ వేషం వేసుకుని హేమచంద్రుడి బస ముందున్న బోయీలలో చేరాడు. కొద్ది సేపట్లో హేమచంద్రుడు బయటికి వచ్చి, "ఒరే, బోయీలూ!" అని కేకపెట్టాడు. మిగిలినవాళ్ళతోబాటు కాళిదాసుకూడా ముందుకువచ్చాడు.

హేమచంద్రుడు పల్లకీలో ఎక్కి కూచో గానే ముందువైపు ఇద్దరు బోయీలూ, వెనుక వైపున ఇద్దరు బోయీలూ పట్టి పల్లకీ ఎత్తారు. ముందున్న ఇద్దరిలో ఒకడు కాళిదాసు.

పల్లకీ సాగిపోతున్నది. పల్లకీ మోత కొంచెమైనా అలవాటులేని కాళిదాసు మాటిమాటికీ భుజం మార్చుకోసాగాడు.

ఇది గమనించి హేమచంద్రుడు,

"అయ మాన్దోలికా దండః స్కంధం
కిం తవ బాధతి ?"

(పల్లకీ బొంగు నీ భుజాన్ని బాధిస్తున్నదా ఏం?) అని అడిగాడు.

హేమచంద్రుడు అన్న మాటల్లో ఒక వ్యాకరణ దోషం ఉంది. "బాధతే" అన

ఆర్. విశ్వేశ్వరశాస్త్రి

వలసినదానికి అతను "బాధతి" అన్నాడు. ఈ అపశబ్దం విని కాళిదాసు మండిపోయి,

"న బాధతే తథా మాం హి యథా
బాధతి బాధతే"

(నీవు ప్రయోగించిన 'బాధతి' బాధించి నంతగా నన్నది బాధించటంలేదు.) అని ఎత్తిపొడిచాడు.

బోయీకి ఇంత పాండిత్యం ఉన్నదా? అని హేమచంద్రుడికి ఆశ్చర్యం కలిగి, "ఏమోయ్? నీకింత భాషాజ్ఞానం ఎలా కలిగింది?" అని కాళిదాసును అడిగాడు.

"అయ్యా, నేను కాళిదాసుగారి పల్లకీ మోస్తూంటాను. ఆయన శిష్యులకు పాఠాలు చెప్పేటప్పుడు నాలుగు ముక్కలు నా చెవినిపడతాయేగాని నాకు భాషాజ్ఞానం ఏమీ లేదు," అన్నాడు కాళిదాసు.

'కాళిదాసు పల్లకీ మోసేవాడికే ఇంత పాండిత్యం వుంటే కాళిదాసు కెంత ఉండాలి?' అనుకొని హేమచంద్రుడు కాళిదాసును స్వయంగా చూడటానికి బయలుదేరాడు.

హేమచంద్రుడు తన ఇంటికి వస్తున్నాడని తెలిసి కాళిదాసు ఒక నౌకరు వేషం వేసుకుని తలవాకిలి వద్ద నిలబడ్డాడు. హేమచంద్రుడు "కాళిదాసుగారున్నారా?" అని అడిగాడు. వెంటనే కాళిదాసు,

నఖ లీన ఖలీన లీలయా నమయ న్నున్నమయ
న్నవం హయం
విరగా దురగారి రంహసా పుర గారుత్మత
గోపురా ద్బహిః"

(కొత్త గుర్రం ఎక్కి, చేతిలో కళ్ళెం పట్టుకుని లాగుతూ, వదులుతూ గరుత్మంతుడి వేగంతో, పట్టణంలోని పచ్చలగోపురం దాటి బయటికి వెళ్లాడు) అని చెప్పాడు.

'కాళిదాసు వాకిట కాపలా కాసేవాడే ఇంత కవి అయితే కాళిదాసును మనం ఓడించేదేమిటి?' అనుకుని హేమచంద్రుడు ఆనాడే అవంతీ నగరానికి వెళ్లిపోయాడు.






పూర్వం రష్యాలో ఒక ముసలావిడ ఉండేది. ఆవిడకిద్దరు కుమారులుండేవారు. అందులో ఒకడు చనిపోయాడు. రెండవ వాడు దూరదేశం ప్రయాణమై వెళ్ళాడు.

వాడు వెళ్ళిన మూడు రోజులకే ముసలావిడ ఇంటికి ఒక సిపాయివచ్చి, "అవ్వా, చీకటి పడుతున్నది, ఈరాత్రికి మీయింటో పడుకోనిస్తావా?" అని అడిగాడు.

"అలాగేలే నాయనా. అయితే నువు ఎక్కణ్ణుంచి వస్తున్నావు?" అని అడిగింది ముసిలావిడ.

"నేను అలోకంనుంచి వస్తున్నాలే!" అన్నాడు సిపాయి.

"నిజంగానా! నా కొడుకు ఈ మధ్యనే పోయాడు. వాడుగాని నీకక్కడ కనపడ లేదుగద?" అని అడిగింది ముసలావిడ.

"కనబడకేం? అతనూ, నేనూ ఒకే గదిలో ఉండేవాళ్ళం," అన్నాడు సిపాయి.

"నిజంగానా!" అన్నది ముసలావిడ.

"మీవాడు ఆ లోకంలో కొంగలను కాస్తున్నాడవ్వా!" అన్నాడు సిపాయి.

"అయ్యో, పాపం! మావాడెంత కష్ట పడిపోతున్నాడో?" అన్నది ముసలమ్మ.

"కష్టం కాదా, అవ్వా? కొంగలంటే ఎటువంటివనుకున్నావు? ముళ్లపొదల మధ్యకి పారిపోతాయి." అన్నాడు సిపాయి.

"ఇంకేం? వాడి బట్టలన్నీ కొర్రుపట్టి ఉంటాయి!" అన్నది ముసలమ్మ.

"అతని బట్టలన్నీ పీలికలూ, వాలికలూ అయాయంటే నమ్మ," అన్నాడు సిపాయి.

"నాదగ్గిర నలభైగజాల తానూ, కొంత డబ్బూ ఉన్నది, నాయనా వాటిని తీసుకుపోయి వాడికిస్తావా?" అని అడిగింది ముసలమ్మ.

"అలాగేలే, అవ్వా," అన్నాడు సిపాయి. వాడారాత్రి ముసలమ్మ ఇంట పడుకుని

టి. రత్నమాంబ

మర్నాడు బట్టల తానూ, డబ్బూ తీసుకుని తనదారిన తాను వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన కొంతకాలానికి, దూరదేశం వెళ్ళిన ముసలమ్మ కొడుకు తిరిగివచ్చాడు.

"ఒరే, నాయనా, నువు వెళ్ళిన సమయంలో ఆ లోకంనుంచి ఒకడు వచ్చాడు. చచ్చిపోయిన నీ అన్న విషయాలన్నీ చెప్పాడు. ఇద్దరూ ఒక గదిలోనే ఉంటున్నారుట. మీ అన్నకివ్వమని ఒక బట్టలతానూ, డబ్బూ ఇచ్చిపంపించా," అన్నది ముసలమ్మ తన రెండో కొడుకుతో.




"చాలా గొప్పపని చేశావు! నిన్ను అమాయికురాలిని చేసి ఎవడో దోపిడీచేశాడు. నీవంటి అమాయకులు ప్రపంచంలో ఇంకా ఎందరున్నారో చూసి నా తెలివితేటలు వాళ్ల మీద చూపిస్తాను," అంటూ ముసలమ్మ కొడుకు బయలుదేరాడు.

పోగాపోగా ఒకగ్రామం వచ్చింది. ఆ గ్రామం జమీందారు భవంతిపక్క పశువుల శాలముందు ఒక ఆడపందీ, దాని పిల్లలూ మేత తింటున్నాయి. ముసలమ్మ కొడుకు ఆడపందిముందు మోకరించి నేలకు వంగి నమస్కారంచేశాడు.

ఇదంతా భవంతి కిటికీనుంచి చూస్తున్న జమీందారు భార్య, తన దాసీని పిలిచి, "ఆ కాపువాడు ఎందుకట్లా నమస్కారం చేస్తున్నాడో విచారించిరావే!" అని పంపింది.

దాసీది వచ్చి ముసలమ్మ కొడుకుతో, "మా పందిముందు సాష్టాంగపడుతున్నావేం?" అని అడిగింది.

"చల్లని తల్లీ, ఈ పంది నా భార్యకు వేలువిడిచిన బంధువు. రేపు నా కొడుకు పెళ్ళి. పెళ్ళిపెత్తనం చెయ్యడానికి పందినీ తోడుపెళ్ళికూతుళ్ళుగా పంది పిల్లల్నీ పంపుతారేమో కాస్త అమ్మగారినడిగి వస్తావా?" అన్నాడు ముసలమ్మ కొడుకు.

దాసీచెప్పిన మాటలు విని జమీందారు భార్య, "పెళ్ళికి పందుల్ని పిలుచుకుపో

వచ్చాడా? ఎంత వెర్రివాడూ! సరేకానీ, వాణ్ణిచూసే నవ్వుతారు, మనకేం? ఆ పందికి నా ఉన్నికోటును తొడిగి, పిల్లలతోసహా గుర్రబ్బండీలో వైభవంగా పంపించు!" అన్నది దాసీతో. దాసీ అలాగే చేసింది.

గుర్రాలను బండీకి పూన్చి, పందినీ, పిల్లల్నీ అందుల్లో కూచోబెట్టి, బండీని ముసలమ్మ కొడుక్కు వప్పగించారు. వాడు బండీ తోలుకుంటూ ఇంటికి బయలుదేరాడు.

వేటకు పోయిన జమీందారు ఇంటికి తిరిగిరాగానే జమీందారు భార్య విరగబడి నవ్వుతూ, "అయ్యో, నవ్వలేక చచ్చాం! మీరు లేకపోతిరి! ఇక్కడి కొక కాపువాడు వచ్చి మన అడపందికి వంగి, వంగి దణ్ణాలు పెట్టసాగాడు. ఎమిట్రా అంటే ఆ పంది తన భార్యకు వేలువిడిచిన బంధువనీ, దానిని తన కొడుకు పెళ్ళికి పెత్తనం చెయ్యటానికీ, తోడుపెళ్ళికూతుళ్ళుగా పందిపిల్లల్నీ పంపమన్నాడు," అన్నది.

"ఇంకేం? నువు పంపావు, అవునా?" అన్నాడు జమీందారు.

"అవును. పందికి నా ఉన్నికోటు తొడిగి పిల్లలతోసహా గుర్రబ్బండీలో ఎక్కించి మరీ పంపాను," అన్నది భార్య.

"వాడెక్కడ ఉంటాడు?" అని అడిగాడు జమీందారు.



"నాకేం తెలుసునండీ?" అన్నది భార్య.

"మతిలేనిదానవు నువ్వు, వాడుకాదు!" అంటూ జమీందారు తన గుర్రం ఎక్కి ముసలమ్మకొడుకును పట్టుకోవటానికి బయలుదేరాడు. గుర్రపుడెక్కల చప్పుడును బట్టి ముసలమ్మకొడుకు తనవెంట ఎవరో పడ్డట్టు పసికట్టాడు; బండీని దట్టమైన అరణ్యంలోకి తోలి, తాను రోడ్డుమీదికివచ్చి, తన టోపీని నేలమీదపెట్టి, ఏమీ ఎరగనట్టు దానిపక్కనే కూచున్నాడు.

ఇంతలో జమీందారు హడావిడిగా అక్కడికి వచ్చి, "ఏయ్, కుర్రవాడా? గుర్రబ్బండీమీద పందినీ, పిల్లల్నీ ఎక్కించుకుని ఇటుగా ఎవడన్నా కాపు పారిపోవటం నువ్వు చూశావా?" అని ముసలమ్మ కొడుకును అడిగాడు.

"చూశాను దొరా. వాడు వెళ్ళి చాలా సేపాయె!" అన్నాడు ముసలమ్మ కొడుకు.

"వాణ్ణిపట్టుకోవాలి. ఎటుగా వెళ్లాడూ?" అని అడిగాడు జమీందారు.

"వాణ్ణి మీరు పట్టుకోలేకేం? పోనీ, మీకీ ప్రాంతాల అడ్డదార్లు తెలుసా?" అన్నాడు ముసలమ్మ కొడుకు.

"ఒరే, నువు చాలా మంచివాడివిగాని, కాస్త నువువెళ్ళి వాణ్ణి పట్టుకురా!" అన్నాడు జమీందారు.



"నేనాండీ? నావల్లకాదండీ! నా టోపీ కింద డేగ ఉన్నది. దానికి కాపలా కాస్తు న్నాను," అన్నాడు ముసలమ్మ కొడుకు.

"నీ డేగను నేను చూస్తూంటాలే," అన్నాడు జమీందారు.

"అది పోయిందంటే యజమాని నాపీక కోసేస్తాడు," అన్నాడు ముసలమ్మకొడుకు.

"దానిఖరీదెంత?" అన్నాడు జమీందారు.

"మూడువందలకు తగ్గదు," అన్నాడు ముసలమ్మ కొడుకు.

"ఇంకేం? అది పోతే దాని ఖరీదు నేను ఇచ్చుకుంటాలే!" అన్నాడు జమీందారు.

"మాటలకేం? ఎన్నయినా చెప్పొచ్చు!" అనాడు ముసలమ్మ కొడుకు.

"నా మాటలో నమ్మకం లేదురా? ఇదుగో, నామాట నమ్మకపోతే మూడు వందలూ తీసుకో!" అన్నాడు జమీందారు.

ముసలమ్మ కొడుకు మూడువందలూ తీసుకుని, జమీందారుగారి గుర్రం ఎక్కి అడవిదారి పట్టి, చెట్లచాటున దాచిన గుర్ర బ్బండీతోసహా ఇంటికి వెళ్ళిపోయాడు.

జమీందారు గంటల తరబడి కూచున్నా వెళ్ళినవాడి జాడలేదు. ఆ సమయానికి సూర్యాస్తమయంకూడా కాబోతోంది.

"ఈ టోపీకింద నిజంగా డేగఉందేమో చూతాం. ఉంటే, వాడు తిరిగి వస్తాడు. లేక పోతే వాడికోసం కనిపెట్టుకోవటం అనవ సరం," అనుకుని జమీందారు టోపీ నేల మీదినుంచి ఎత్తాడు. దానికింద ఏమీలేదు.

"దొంగవెధవ! నాభార్యను మోసగించిన వాడు వాడే అయిఉండాలి!" అనుకుంటూ జమీందారు ఇంటికి బయలుదేరాడు.

ముసలమ్మ కొడుకు జమీందారు గుర్రాన్ని, బండీనీ, పందినీ, పిల్లలనూ, డబ్బునూ ఇంటికి పట్టుకుపోయి తల్లికి చూపించి, "చూశావా అమ్మా? నీకన్న కూడా అమాయికులున్నారు, ప్రపంచంలో! ఇక మన కేలోటూ వుండదు!" అన్నాడు.



# తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరు!

బ్రహ్మదేవుడు సృష్టియావత్తూ ముగించిన పిమ్మట సమస్త జీవరాసులనూ సమావేశపరచి, "జీవులారా! మిమ్మల్ని నేను నా చేతనైనట్టు సృష్టిచేశాను. అయితే మీరిలాగే ఉండిపోనవసరంలేదు. మీలో మీకు నచ్చని లోపాలేవైనా ఉంటే సరిచెయ్యటానికి నాకేమీ అభ్యంతరంలేదు. మీలోగల లోపాలు సరి చెయ్యటమేకాదు, ఇతరులలోగల గుణాలు మీకు కావాలన్నప్పటికీ నేను మీకు వాటిని ఇచ్చెయ్యగలను. ఒకరి తరవాత ఒకరుగా నేను చేసిన సృష్టిని విమర్శించుకుంటూ రండి," అన్నాడు.



ముందు కోండముచ్చు లేచి గొంతు సవరించుకుని, "నాన్నగారూ! నామటుకు నాలో ఏ లోపమూ లేదు. నేను నిక్షేపంలా ఉన్నాను. కాని ఈ ఎలుగుబంటిని చూస్తే నాకు ఏడుపు వస్తోంది-వొంటినిండా జూలూ, అర్థంలేని నడకా అదీనూ!" అన్నది.

తరవాత ఎలుగుబంటి లేచి, "నా బొచ్చుకేం వంక వచ్చింది? హాయిగా వెచ్చగా ఉంటుంది. తమదయవల్ల నాకు ప్రతి క్షణమూ ఎలా ఉండాలో అలా ఉంచారు. కాని, పాపం, ఈ ఏనుగును చూస్తే నాకు చాలా అవకతవకగా కనిపిస్తోంది," అన్నది.

ఈ విధంగా ప్రతి జంతువూ లేచి తమకు తాము చాలా ఆదర్శవంతంగా వున్నట్టూ, ఇతరులను సృష్టించటంలో బ్రహ్మదేవుడు అనేక పొరపాట్లు చేసి నట్టూ మాట్లాడాయి.

అంతావిని బ్రహ్మదేవుడు చివరకు ఒక్క నిట్టూర్పు విడిచి జంతువుల నన్నింటిని పంపేశాడు. ఆయనకు వాటి లోపాలను సరిదిద్దవలసిన బాధ తప్పిపోయింది!

# ఇంద్రజాలము

ప్రొఫెసర్: పి. సి. సర్కార్




కొన్నాళ్ళక్రితం బెంగాల్ రాష్ట్రంలోని, బాలీగంజ్‌లో అఖిలభారత ఇంద్రజాలికుల సంఘ సమావేశం ఒకటి జరిగింది. అప్పుడు అక్కడివారంతా నన్నేదయినా ఇంద్రజాలం చేసిచూపమని కోరితే నేనిది చేసిచూపాను.

ఓ కొత్త పావలాబిళ్ళ, మూడు పేకముక్కలతో నేనీ ప్రదర్శన ప్రారంభించాను. ముందు టేబిల్ మీద ఒక కొత్త పావలాబిళ్ళ పెట్టి, దానిమీద ఓ మామూలు పేకముక్కను పెట్టాలి. దానిని 1 గుర్తున్న చోట పెట్టామనుకోండి. తర్వాత 2,3 గుర్తులుగల చోట్ల రెండు పేకముక్కలు తిరగేసి పెట్టాలి.

అప్పుడెవరైనా ఆ పావలాబిళ్ల దేనికింద వున్నది అని అడిగితే 1 వ పేకముక్క కింద వున్నదని నిస్సందేహంగా చెప్పివెయ్యాలి. ఆ ముక్క ఎత్తి చూపితే ఆ పావలా అక్కడే వుంటుంది. అప్పుడే 2,3 ముక్కల్నికూడా కొంచెం ఎత్తి, వాటి కింద ఏమీలేదని చూపవచ్చు. ఇంద్రజాలికుడు తర్వాత తన మాయాదండ ప్రభావంతో—1-వ పేకముక్క కింద పావలాను మాయంచేస్తాడు. ఆ పేకముక్కను ఎత్తిచూపితే అక్కడ పావలా ఉండదు. అది 2-వ పేకముక్క కిందికి వెళ్ళిపోయివుంటుంది. అలాగే తర్వాత దాన్ని 3 పేకముక్క కింద చూసి తెల్లబోతారు ప్రేక్షకులు. వస్తుతః 1,2,3 పేకముక్కల్లో దేనికింద నుంచి అయినా దీన్ని తీసి చూపించవచ్చు. ఇదిచూసి అందరూ ఆశ్చర్యపోతారు. కాని ఒక పేకముక్కకింది పావలా, మరొక ముక్కకిందికి ఎలా వచ్చిందో తెలుసుకోలేరు. నిజానికిది

చేసి చూపటం చాలా సులభం. మూడు మామూలు పేకముక్కలు, మూడు ఒకేరకపు పావలా బిళ్లలతో దీన్ని చేసి చూపాలి. ఇంద్రజాలికుడు పక్క చిత్రంలో చూపిన రీతిగా తన చేతిలో ఓ శక్తివంతమైన సూదంటు రాయిని దాచి ఉంచుకోవాలి. దాన్ని అలా దాచి వుంచుకోవటాన్ని 'హస్తలాఘవం' అంటారు. ప్రతి ఇంద్రజాలికుడికి ఈ హస్తలాఘవం అలవాటయ్యే ఉంటుంది. అలా సూదంటురాయిని చేతిలో దాచుకుని, దాంతో పేకముక్కను తాకితే అది కిందనున్న పావలాను పేక ముక్కకు అతుక్కునేట్లు చేస్తుంది. అది ప్రేక్షకులు సాధారణంగా గ్రహించలేరు. చేతిలోవున్న సూదంటు రాయిని పేకముక్కకు కొంచెం దూరంగా ఉంచితే అది పావలాబిళ్లను ఆకర్షించలేదు. అప్పుడిహ ఆ పావలా విడిగా ఉండిపోతుంది. ఆ సూదంటు రాయిని నేర్పుగా దాచి ఉంచుకోవటం లోనే ఈ తమాషాఅంతా ఆధారపడి వుంది. దీన్ని కొత్త పావలాబిళ్ళలతోనే చెయ్యాలి. పాతపావలాలను అయితే ఈ సూదంటురాయి ఆకర్షించలేదు. మూడు పావలాలు ఒకే రకానివీ, ఒకే సంవత్సరానివీ, ఒకే రకంగా తళ తళలాడుతున్నవీ అయివుండటం




మేలు. లేకపోతే 1-వ ముక్క కింది నుంచి 2-వ ముక్క కిందికి, అలాగే 3-వ ముక్క కిందికి వచ్చినట్లు చూపించేప్పుడు పట్టుబడి పోవలసి వస్తుంది. ఇది చాలా సులువైనదే, కాని ఎరగనివాళ్ళ ఎదుట చేసిచూపిస్తే— చాలా తమాషాగా ఉంటుంది.

[పాఠకులు, యీగారడీని గురించి సలహాలు పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ, ప్రొఫెసరుగారి పేర ఉత్తరం రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషు లోనే రాయాలి.

వారి అడ్రసు యిది:- ప్రొఫెసర్: పి. సి. సర్కార్, మెజిషియన్, పోస్టుబాక్సు 7888, కలకత్తా-12.]

## శుష్కోపచారాలు

ఒక జమీందారు కొనక కొనక ఎంతో డబ్బుపోసి ఒక మంచి జాతిగల అరబ్బీ గుర్రాన్ని కొన్నాడు. ఆ గుర్రాన్ని కొన్నదిమొదలు జమీందారుకు దాన్ని చూసి మురియటమేగాని మరొక ఆలోచనలేదు. ఈ గుర్రంకోసం జమీందారు చక్కని భవంతిలాటి సాల కట్టించాడు. దాన్ని రోజూ రెండుపూటలా తానే స్వయంగా మాలీసు చేస్తూవచ్చాడు. జమీందారు ఇంత అప్యాయంగా చూసుకుంటున్నా గుర్రం నానాటికీ చిక్కిపోసాగింది.

ఆఖరుకు ఒకనాడు జమీందారు తన గుర్రంతో, "నేను ఇంత అభిమానంతో నిన్ను స్వయంగా సాకుతున్నాను. నేనే స్వయంగా నీకు మాలీసుకూడా చేస్తున్నానుగదా, నీకు పోషణచేసేవారే లేనట్టుగా ఎందుకిలా చిక్కి శల్యమై పోతున్నావు?" అని అడిగాడు.



ఈ ప్రశ్నకు గుర్రం హీనస్వరంతో ఇలా సమాధానం చెప్పింది:

"నన్ను ఇంత పెద్ద భవంతిలో పెట్టి, తమరు స్వయంగా మాలీసు చెయ్యటంవల్ల నాకు ఒరిగినదేమిటి? నా పొట్టసంగతి మీకు తోచనేలేదు. మాలీసూ వద్దు, మట్టీ వద్దు. వేళకింత తిండి పడెయ్యండి, నేను మళ్ళీ ఒళ్ళుచేస్తాను!"

## శుష్కత్యాగం

ఒకావిడకొక కొడుకుండేవాడు. ఇంకొక కొడుకు కలగాలని కోరిక కలిగి ఆమె ఒక శాస్త్రేయుణ్ణి సలహా అడిగింది. "నీ కొడుకును కాళికాదేవికి బలి ఇస్తివా, నీకు మరొక కొడుకు పుడతాడు," అని వాడు చెప్పాడు. ఆ పిచ్చిది అలాగే చేయబోతుండగా ఒక ముసలిది, "ఓసీ, వీణ్ణి బలిఇస్తే నీకు మళ్ళీ ఒకడేకదా కలుగుతాడు? ఒకవేళ ఇంకొడు కలక్కపోతే, వీడుకూడా పోడా?" అని మందలించి వారించింది.

# స్వార్థం - అనర్థం

ఒక వర్తకుడు ఒక గాడిదమీదా, గుర్రంమీదా సరుకువేసుకుని దూరప్రయాణం చేస్తున్నాడు. గాడిదమీద మోయరానంత బరువున్నది. రానురాను అది నడవ లేని స్థితికి వచ్చింది.

అప్పుడు గాడిద గుర్రంతో, "అన్నా, ఇట్లాఅయితే నేనింకెంతో దూరం నడవలేను. నీ పుణ్యం ఉంటుంది, నామీది బరువు కాస్త నువు తీసుకుందూ!" అని బ్రతిమాలింది.

దీనికి ఎంతమాత్రం ఒప్పక గుర్రం, "నీ బరువు నేనెందుకు మొయ్యాలి? ఎవరి కర్మ వాళ్ళు అనుభవించవలసిందే!" అని వేదాంతం చెప్పింది.

కొంతదూరం పోయాక బడలికతో గాడిద పడిపోయి చచ్చింది. వర్తకుడు అప్పుడే గాడిద చర్మం ఒలిపించి, గాడిదమీద ఉండిన బరువుతోబాటు గాడిద తోలుకూడా గుర్రంమీదనే వేసి తోలుకుపోసాగాడు.

ఇప్పుడు గుర్రంమీద మోయరానంత బరువయింది. అది బలవంతాన కాలుతీసి కాలువేస్తూ, "అయ్యో, ఎంత అనర్థం వచ్చిపడింది? గాడిద అడిగి నప్పుడే కొద్దిపాటి బరువు నేను పంచుకునివుంటె ఇంత బరువూ నాపైన పడదు కద. గాడిదను చావనిచ్చినందుకు నా చావు మూడేలాగుంది!" అనుకున్నది.



# దురాశ దుఃఖంచేటు

ఒక తోడేలు ఒక నక్కతో స్నేహం చేసుకున్నట్టే చేసుకుని ఆ నక్కపై పెత్తనం సాగించింది.

తోడేలు బలమైనది కావటంచేత నక్కకు దాస్యంతప్పలేదు.

తనకు తిండి దొరకనప్పుడల్లా తోడేలు, "నాకు తిండి చూపిస్తావా? నిన్ను చంపితిననా?" అని నక్కను బెదిరించేది.

నక్క యుక్తిగలది గనక ఏదో మాయోపాయంచేసి తోడేలుకు తిండి చూపుతూ ఉండేది.

ఒకనాడిలాగే తోడేలు నక్కతో, "నాకు ఆకలి దహించుకుపోతోంది. వెంటనే ఎక్కడైనా తిండి దొరికేమార్గం చూపిస్తావా? లేకపోతే నిన్ను చంపి తినమన్నావా?" అని అడిగింది.

"ఏలినవారు తొందరపడకండి. ఇవాళ ఉదయమే ఒక చాకలివాడు గొర్రెను కోసి దాని మాంసమంతా బానలో దాచివుంచాడు. చీకటి పడగానే మనం వెళ్లి తినవచ్చు," అన్నది నక్క.

ఆ ప్రకారమే చీకటిపడ్డాక నక్కా, తోడేలూ కలిసి చాకలి ఇంటివద్దకు వెళ్ళాయి. ఇంటి గోడలో చిన్నకంత ఉన్నది. దానినుంచి దూరి రెండూ లోపల ప్రవేశించాయి. నక్క చెప్పినట్టు బానలో మాంసం ఉన్నది. నక్క కొద్దిగా తిని, "ఇక మనం పోదాం," అన్నది. తోడేలు వినిపించుకోక, "దొరికిన తిండి ఎందుకు పోగొట్టుకోవాలి? తినగలిగినంత తిన్నదాకా నేను రాను," అన్నది. లోపల చప్పుడువిని చాకలి లేచివచ్చాడు. నక్క కంతలో నుంచి దూరి బయట పడింది. కాని తెగతిని కడుపు ఉబ్బివున్న తోడేలు కంతలో ఇరుక్కుపోయింది. చాకలి దాన్ని దుడ్డుకర్రతో చావమోదాడు.



# కదపకురా, కరిచేను!





# గాడిదకు చదువు

ఒకదేశానికి ఒక పెద్దమనిషి వచ్చిచేరాడు. తాను మహా విద్వాంసుడిననీ, ఎంత చదువురానివారికైనా చదువు చెప్పగలననీ ఆయన అడిగినవారికల్లా చెప్పుకున్నాడు.

కాలక్రమాన ఈ వార్త ఆదేశపు రాజుకు తెలిసింది. ఆయన ఈ విద్వాంసుణ్ణి తన కొలువుకు పిలిపించి, "ఏమయ్యా? నువు ఎటువంటి శుంఠలకైనా చదువు చెబుతావని విన్నాను, నిజమేనా ?" అని అడిగాడు.

"చిత్తం, మహాప్రభూ! డబ్బిచ్చేదాత ఉండాలేగాని పదేళ్ళు గడువిస్తే గాడిదచేత వేదపాఠాలు చెప్పించనూ ?" అన్నాడు విద్వాంసుడు.



"మా దివాణంలో ఒక గాడిదె ఉన్నది. దానిచేత వేదం చెప్పించటానికి ఏం తీసుకుంటావు?" అని అడిగాడు రాజు.

"పదేళ్లు గడువివ్వండి. నెల ఒకటింటికి వెయ్యి వరహాలిప్పించండి," అన్నాడు విద్వాంసుడు.

"పదేళ్ల అనంతరం గాడిద వేదం చదవలేకపోతే, నీతల తీయిస్తాను, తెలిసిందా!" అన్నాడు రాజు.

"నిరభ్యంతరంగా తీయించండి!" అన్నాడు విద్వాంసుడు. రాజు ఆరోజునే, విద్వాంసుణ్ణి వెయ్యి వరహాల నెలజీతంమీద గాడిదకు ఉపాధ్యాయుడుగా నియమించాడు.

ఇదంతా చూసిన ఆప్తుడొకడు విద్వాంసుడితో, "ఇదేంపని? నూరేళ్లకు మాత్రం గాడిద వేదపాఠాలు చదువుతుందా? నీ ఆయుర్దాయం పదేళ్ళు దాటకుండా చేసుకున్నావేం?" అని అడిగాడు.

"పదేళ్ళకు నేనే చస్తానని ఎందు కనుకోవాలి? ఈ లోగా గాడిద చావగూడదా? రాజు చావగూడదా?" అన్నాడు విద్వాంసుడు.

# ముగ్గులు









# పురాతన జంతువులు

వెన్నెముకగల తొలి జంతువులు చేపలు. చేపల యుగంలో ఇవి చాలా విరివిగా అభివృద్ధి చెందాయి. వీటిలో కొన్ని ఊపిరితిత్తులుకూడా సంపాదించి నీటి బయట ఊపిరిపీల్చ గలిగాయి. చేపలయుగం ముగిసేనాటికి కొన్ని రకాల జీవరాసులు నేలపై నివసించసాగాయి. వీటిలో తేళ్ళూ, సాలీళ్ళూ, చాలాపెద్ద తూనీగలూ, బ్రహ్మాండమైన బొద్దింకలూ ఉండేవి. ఇవన్నీ వెన్నెముక లేని జంతువులే.

నేలమీద నివసించ నేర్చిన తొలి జంతువులలో వెన్నెముక గలవి ఉభయ జీవులు. ఇవి నీటిలో పెట్టిన మెత్తని గుడ్లనుంచి వెలువడి, నీటిలోనే కొంతకాలం అభివృద్ధిచెంది, వాటిరూపం తలిదండ్రుల రూపాన్ని పోలినాక నేలమీదికి వచ్చాయి.

గట్టిపెంకు గల గుడ్లనుంచి నేలమీదనే నేరుగా, తలిదండ్రుల ఆకృతికి సమమైన రూపంలో, మొట్టమొదట జన్మించిన జంతువులు సరీసృపాలు. 27 న్నర కోట్ల ఏళ్ళక్రితం మొదటి సరీసృపాలు భూమిపై అవతరించాయి. మరి 15 కోట్ల ఏళ్లకాలంలో ఇవి బ్రహ్మాండ మైన ప్రమాణాలకు తమ శరీరాలను పెంచుని భూమిమీద ఏకచ్ఛత్రాధిపత్యం సాగించాయి.

సరీసృపాలలో అనేకవేల రకాలు పుట్టాయి. వీటిలో నేలమీద నివసించిన వాటికి "డిన జార్" అని పేరు. ఈ మాటకు "భయంకరమైన బల్లులు" అని అర్థం. "టిరనోజారస్" అనే జంతువు నిజంగానే భయంకరమైనది. దాని ఎత్తు 18 లేక 20 అడుగులు. దాని నోరు పూర్తిగా విప్పితే గజం నిడివి ఉండేది. నోటినిండా వాడిఅయిన దంతా లుండేవి. దాని చేతులకు వాడిఅయిన గోళ్లుండేవి. అది తోక సహాయంతో నిలబడి నడిచేది. సృష్టిలో ఇంత వరకు దీనిని మించిన మాంసాహరి లేదు.

"ట్రిసిరటాప్స్" అనేది మూడు కొమ్ములు గలది. దానికి ముఖమంతటా కవచం ఉండేది. ఇది మొక్కలు తిని జీవించేది.

"బ్రాన్టజారస్" నిడివి 70 అడుగులు. దాని బరువు సుమారు 35 టన్నులు. ఇది నడుస్తూంటే భూమి దద్దరిల్లి ఉండాలి. అయితే ఇదికూడా మొక్కలుతినే జంతువే. దీని శరీరంతో పోలిస్తే దీని మెదడు చాలా చిన్నది. అందుచేత ఈ జంతువు అటే తెలివితేటలు గలదై ఉండదు.



# గ్రహాలు: శని



శనిగ్రహం సూర్యుడికి 90 కోట్ల మైళ్ళ దూరంలో తిరుగుతున్నది. దీనిమీదపడే సూర్య కాంతి భూమిమీదపడే కాంతిలో నూరోవంతు మాత్రమే ఉంటుంది. ఇది సెకండుకు సుమారు 6 మైళ్ళ వేగంతో సూర్యుణ్ణి చుట్టివస్తూ, 10,760 రోజులలో ఒకసారి చుట్టివస్తుంది. అది శనికి ఒక సంవత్సరం—మన సంవత్స రానికి 30 రెట్లు.

★ గురుగ్రహంలాగే శనిగ్రహంకూడా, చాలా పెద్దగోళం. దాని వ్యాసం నిడివి 76,470 మైళ్ళు. ఈగ్రహం 10 గంటల 14 నిమిషాల కొకసారి తనచుట్టూ తాను తిరుగు తుంది. అది శనికి ఒకరోజు—మనరోజులో సగంకంటె తక్కువ.

★ అందుచేత భూమిమీద 90 ఏళ్ళు బతికేమనిషి శనిగ్రహంమీద 3 ఏళ్ళు మాత్రమే చూస్తాడు. అయితే ఆమనిషి ఆ మూడేళ్ళకాలంలో సుమారు 80 వేల రోజులు చూస్తాడు! కాని ఇది అంచనా మాత్రమే. ఎందుకంటే శనిగ్రహంలో ప్రాణులుండే అవకాశంలేదు. ఆ గ్రహంలో చలి విపరీతం. అదీగాక ఆ గ్రహంలోఉండే వాతావరణపు వాయువులు జీవులు బతకటానికి అనుకూలించేవికావు.

★ శనిగ్రహం చుట్టూ తిరుగుతూ 9 ఉపగ్రహాలున్నాయి. ఇవి ఆగ్రహానికి చంద్రుడు లాటివి.

★ మిగిలిన గ్రహాలకు వేటికీలేనిది శనిగ్రహానికి ఒకటున్నది. ఇదేమంటే, శనిగ్రహం చుట్టూఉన్న వలయాలు. ఇవి ఉత్త కంటికి కనబడవు, టెలెస్కోప్‌లోనుంచి చూస్తేనే కనిపిస్తాయి. గెలీలియో అనే ప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు మొట్టమొదటిసారి టెలిస్కోప్‌లోనుంచి శనిగ్రహం చుట్టూఉన్న వలయాలను చూసినప్పుడు అత్యాశ్చర్యం పొందాడట. ఇప్పటికీ ఇవి చూసే వారిని ఆశ్చర్యపరుస్తూంటాయి.

★ శనిగ్రహం చుట్టూ మూడు పలచని వలయాలున్నాయి. అందులో గోళానికి దగ్గిరిగా ఉండేది అంత కాంతివంతంగా ఉండదు; చూడటానికి క్రేప్‌లాగుంటుంది. రెండవది చాలా కాంతివంతంగా ఉంటుంది. దానిచుట్టూ ఉండేది అంత కాంతివంతంగా ఉండదు. ఈ మూడు వలయాల నిడివీ కలిసి 40 వేల మైళ్ళుంటుంది. కాని వాటిమందం 100 మైళ్ళు మాత్రమే.

★ ఈ వలయాలలో చేరిఉన్నవి గాలిలో తేలే నలుసులాటివని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఇవి కోటానకోట్ల సంఖ్యలో ఉన్నాయి. ఈ వలయాల నీడ శని గోళంమీద పడటం మనం టెలిస్కోపులోనుంచి చూడవచ్చు. ఆ నీడయొక్క నిడివి ఒక భూఖండమంత ఉంటుంది.

## గోడమీది బొమ్మ - 5 (అట్టచివరి బొమ్మ)

"జ్యోతి"కి చాలా ఆగ్రహం వచ్చింది. ఆమె చక్రవర్తితో, "నేను నా భర్తను ఎంతమాత్రం వదలను. ఆయన మీకన్న అన్నివిధాల గొప్పవాడు," అంటూ చరచరా అక్కడినుండి వెళ్లిపోయింది.

ఈ మాటలు విని చక్రవర్తి మండిపడ్డాడు. "తన భర్త నాకన్న అన్ని విధాలా గొప్పవాడనటానికి ఆమెకెన్ని గుండెలు! అయినా మాలో ఎవరు ఎక్కువో చూపిస్తాను!" అంటూ ఆయన ఒక భటుణ్ణి పిలిచాడు.

"ఒరే, నీవు వెంటనే ఆ ఛ్వాంగ్‌దగ్గిరికి వెళ్ళి రేపు నాతో గుర్రపుస్వారీ పందెం వెయ్యటానికి రమ్మని ఆజ్ఞాపించు. మా ఇద్దరిలో ఎవరు ఆ పందెంలో గెలిస్తే, వారికి 'జ్యోతి' భార్య అవుతుందని చెప్పు. తెలిసిందా, వెళ్ళు!" అన్నాడు చక్రవర్తి భటుడితో.

ఆ భటుడు ఛ్వాంగ్‌దగ్గరకు వెళ్లి సంగతంతా చెప్పాడు.

ఈ వార్తవిని "జ్యోతి" కొంచెమైనా కలవరపడలేదు. ఆమె తన భర్తతో "నీకేమీ భయంలేదు. పందెంలో నీవే గెలుస్తావు!" అన్నది.

ఆమె వెదురుకర్రలతోనూ, కాగితంతోనూ ఒక గుర్రం బొమ్మచేసి దాని మీద ఒక్కసారి ఊదింది. వెంటనే అది ప్రాణంగల తెల్లగుర్రంగా మారి పోయింది. ఛ్వాంగ్ అమితాశ్చర్యం పొందాడు.

మర్నాడు ఛ్వాంగ్‌కూ, చక్రవర్తికీ గుర్రపుస్వారీ పోటీ జరిగింది. చక్రవర్తి ఎక్కిన గుర్రం ఛ్వాంగ్ గుర్రంకన్న ముందు పరిగెత్తసాగింది. చక్రవర్తి వెనక తిరిగిచూసి ఛ్వాంగ్‌ను విజయగర్వంతో హేళనచేశాడు.

కాని తీరా గమ్యస్థానం సమీపించేలోగా ఛ్వాంగ్ గుర్రం ఒక్క దౌడుతీసి చక్రవర్తి గుర్రాన్ని దాటి ముందు పరిగెత్తింది. ఇదిచూసి అక్కడ చేరిన ప్రజలు హర్షధ్వానాలుచేశారు.

"అయిందా?" అన్నాడు ఛ్వాంగ్ చక్రవర్తితో.

"అప్పుడేనా? రేపు పడవల పందెం వేసుకుందాం. అందులో గెలిస్తే నీ భార్యను నువే ఉంచుకో!" అన్నాడు చక్రవర్తి.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1956 జనవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ నవంబరు 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## నవంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : దిగి ఈదులాడేవి రెండు!

రెండవ ఫోటో : దిబ్బెక్కి చూచేవి రెండు!

పంపినవారు : వి. బి. ఎ. నరసింహం, సెంట్రల్‌స్టోర్స్, ఖర్గపూరు.

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# వార్తలు-విశేషాలు

ఆచార్య వినోబాభావే ఒరిస్సా రాష్ట్రంలో తన భూదానయాత్ర ముగించుకొని ప్రస్తుతం ఆంధ్రదేశ పర్యటన చేస్తున్నారు. వారు ఒరిస్సా రాష్ట్రంలో మొత్తం 812 గ్రామాలు సేకరించారు. అక్కడ సేకరించబడిన భూమి మొత్తం 2,57,277 ఎకరములు. 94,757 మంది దాతలవల్ల ఈ భూమి లభ్యమైంది.

*          *          *

తెలుగు, కన్నడ, తమిళ, మలయాళ భాషల ప్రాచీన, నవీన గ్రంథాలను ప్రజలకు తక్కువ ధరలకు అందజేయాలన్న ప్రయత్నంలో "సదరన్ లాంగ్వేజస్ బుక్ ట్రస్ట్" అనే సంస్థ స్థాపించబడింది. ఈ సంస్థ ప్రారంభోత్సవం ప్రధాని నెహ్రూచే జరుపబడింది.

*          *          *

ఆంధ్రరాష్ట్రప్రభుత్వం ద్వితీయ ప్రణాళికలో వ్యవసాయానికి 16 కోట్లు, పరిశ్రమలకు 10 కోట్లు, విద్యుచ్ఛక్తి నీటిపారుదలలకు 58.1, రాజధాని అభివృద్ధికి 3 కోట్లు ఖర్చు పెట్టవలసి వుంటుందని, ప్రభుత్వాధికారుల సమావేశం నిర్ణయించింది.

*          *          *

భారతప్రధాని జాతీయ సహాయనిధికి 1955 అక్టోబర్ 1 వ తేదీనుంచి అక్టోబర్ 5 వ తేదీవరకు రు. 21,848-6-0 వసూలైంది. 1947 నవంబరులో యీ నిధి ప్రారంభించబడింది. ఆనాటినుంచి 1955 అక్టోబర్ 5 వ తేదీవరకు వసూలైన మొత్తం రు. 1,36,48,291-6-3.



ఇండియా ప్రభుత్వం, బర్మాకు 20 కోట్ల రూపాయలు రుణంగా యివ్వనున్నది. దీనికి సంవత్సరానికి నూటికి నాలుగు రూపాయల వడ్డీ నిర్ణయించబడింది. 1959 మార్చి నెలనుంచి అర్ధసంవత్సరానికి $2\frac{1}{2}$ కోట్ల వంతున బర్మాప్రభుత్వం ఈ రుణం చెల్లించగలదు. ఈ ఒడంబడికపై ఇండియా తరఫున ఆర్థికశాఖా మంత్రి శ్రీ చింతామణి దేశముఖ్ సంతకంచేశారు.

* * *

మనదేశంలో మరొక ఉక్కు ఫ్యాక్టరీ (నాల్గవది) బీహారు రాష్ట్రంలోని బొకారాలో నిర్మించుటకు కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. ఈ విషయం ఇండియా వాణిజ్య మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు వెల్లడించారు.

* * *

తూర్పు గోదావరిజిల్లా భద్రాచలంలోని సుప్రసిద్ధ రామాలయం పునరుద్ధరించబడుతుంది. ఈ దేవాలయప్రాంతం ఆంధ్రరాష్ట్రంలో వున్నప్పటికీ, దీని నిర్వహణ బాధ్యత అంతా హైదరాబాద్ ప్రభుత్వం అధికారంకింద వున్నది. దేవాలయ పునరుద్ధరణ కార్యక్రమాన్ని ఆంధ్ర, హైదరాబాద్ ప్రభుత్వాలు కలిసి నిర్వహిస్తాయని, దేవాదాయశాఖా మంత్రి శ్రీ కె. చంద్రమౌళిగారు ప్రకటించారు.

* * *

ఈ సంవత్సరం మార్చినెలలో జరిగిన ఆంధ్ర అసెంబ్లీ ఎన్నికలకు ప్రభుత్వానికి 35,18,000 రూపాయలు ఖర్చుఅయినవని అసెంబ్లీలో ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు చెప్పారు.

* * *

మన ఇండియన్ యూనియన్ యిప్పుడు 27 రాష్ట్రాలుగా విభజింపబడివున్నది. కేంద్ర ప్రభుత్వంచే నియమింపబడిన భాషారాష్ట్ర విభజన సంఘంవారు (ఫజిల్ అలీ కమిషన్) ఇప్పుడు దేశాన్ని 16 పెద్ద రాష్ట్రాలుగాను, 3 కేంద్రపాలిత ప్రాంతాలుగాను పునర్విభజన చేయాలని ఇండియాప్రభుత్వానికి సిఫార్సుచేశారు.



# చిత్రకథ



ఒక ఆదివారం రోజున దాసూ, వాసులు ఒక చిన్న రబ్బరుబంతి సంపాయించి, దానితో ఫుట్‌బాల్ ఆట ప్రారంభించారు. దాసు ఆ బంతిని గోడమీంచి అవతలికి పోయేట్టు తంతూంటే, టైగర్ గేటుగుండా బయటికి పరిగెత్తి, దాన్ని తిరిగి తెస్తోంది. రెండు మూడుసార్లు ఇలా జరిగాక, ఆ బంతిని ఒక ఊరకుక్క చూచింది. అది తన నోటిలోని బొమికను అక్కడ పెట్టి, ఆ బంతిని నోట కరుచుకుని ఉడాయించింది. టైగర్ చేసేదిలేక, ఆ కుక్క వదిలిన బొమికను నోటకరుచుకుని లోపలకు వచ్చింది. దాసూ, వాసూలు గాభరాపడిపోయ్యారు.



Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him

# ఎనామెల్ బోర్డులు, పాత్రలు

ELECTRIC SHADES

WARNING SIGNS







**ADVERTISEMENT SIGNS**

For permanence and effective publicity




**PUBLIC UTILITY SIGNS**

Street Name Boards
· Traffic Signs ·
· Caution Signs ·







**HOSPITAL WARE**

Douche Cans, Bed Pans,
· Commodes, Basins, ·
· Trays etc. ·

**HOUSEHOLD UTENSILS**

Rice Plates, Mugs,
Bowls, Soap Dishes,
· Spoons, Laddles. ·

## మద్రాస్ ఎనామెల్ వర్క్సు లిమిటెడ్
## 65, సైడన్‌హామ్సు రోడ్డు : మద్రాస్.


నవభారతనిర్మాణానికి...